# సోవియట్ సమీక్ష

లెనినూ,
సోషలిస్టు ప్రజాస్వామ్యం

సోషలిజంలో జాతుల
మధ్య సంబంధాలు

పెరిస్త్రోయికా,
ఇస్లాంమతము

4 ఏప్రిల్ 1989

# సంబంధాలు




మాస్కోలో రికార్డు కంపెనీల అంతర్జాతీయ ప్రదర్శన, ఉత్సవం. ఈ ఉత్సవంలో భారతదేశ సి.బి.ఎస్. కంపెనీ తరఫున విశ్వాస్ సింధే, మోహన్ జాక్తప్ ప్రాతినిధ్యం వహించారు.



మాస్కోలోని షెర్మెత్యేవ్ విమానాశ్రయంలో ఫిన్నిష్ రక్త ప్రవీణులు. ఇటీవల ఆర్మీనియాలో సంభవించిన భూకంపబాధితులకు సహాయపడేందుకు వచ్చారు.



మాస్కో సెంట్రల్ ఛిల్డ్రన్స్ థియేటర్‌లో టామ్‌సాయర్ నాటకాన్ని ప్రదర్శిస్తున్న అమెరికన్ ప్రొడ్యూసర్ జాన్‌క్రాన్నీ

# సోవియట్ సమీక్ష

4

సంపుటి 23
ఏప్రిల్
1989

●

సంపాదకుడు :
వి. ఎఫ్. మ్క్ల్యాబిన్
సంయుక్త సంపాదకుడు :
జి. ఆళవందార్
సహాయ సంపాదకుడు
మునగాల జనార్దన రెడ్డి
ఆర్టిస్ట్
వి.ఒ. అదామొవిచ్

●

పుటల రూపరచన
వి. పల్యొకవ్

●

11 భారతీయ భాషల్లో వెలువడే పత్రిక

●

SOVIET SAMEEKSHA - (Telugu)

●



ఈ సంచికలోని చిత్రాలు, వ్యాసాలు
నొవొస్తి వార్తా సంస్థవి

●

Printed by S. G. Dychev and Published by him at Soviet Nadu Office, 115, Theagaraya Road– Madras-600 017, (Phone:440201), for the Information Department of the USSR Embassy in India. Printed at Pavai Printers (P) Ltd., 142, Jani Jan Khan Road, Madras-600014.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నిర్మాత, సోవియట్ రాజ్య నిర్మాత అయిన వి.ఐ.లెనిన్ 1870 ఏప్రిల్ 22 న జన్మించారు. ఆయన రాజకీయ, సైద్ధాంతిక, ఆచరణాత్మక సంబంధమైన వారసత్వం ప్రత్యేకించి ప్రస్తుతం సోవియట్ యూనియన్‌లో జరుగుతున్న పునర్ వ్యవస్థీకరణ కృషికి ముఖ్యమైనది. (13వ పేజీ చూడండి).

1

# ఈ సంచికలో





52

**లెనినూ, సోషలిస్టు ప్రజాస్వామ్యం**

3

## సంపాదకీయం

వి.ఐ.లెనిన్ 119 వ జయంతిని సోవియట్ యూనియన్‌లో పెరిస్త్రోయికా అమలు జరుగుతున్న సమయంలో పాటిస్తున్నారు. లెనిన్ భావాల వైపు, సోషలిజపు మూలాల వైపు దృష్టిని మళ్ళించడం—యిది యీ పెరిస్త్రోయికా క్రమంలో అత్యున్నత సైద్ధాంతిక, రాజకీయ ప్రాధాన్యతగల కర్తవ్యం. లెనినిస్టు భావన ప్రకారం లోగడ రాజ్యం బాధ్యతగా వున్న అంశాలను చాలా వరకు సమాజం స్వీకరించాలి. ఈ రకం సోషలిజాన్నే లెనిన్ ఊహించారు. సోవియట్ ప్రజలు కోరుకుంటున్నదీ, పెరిస్త్రోయికా క్రమంలో సాధించడానికి ప్రయత్నిస్తున్నదీ యీ రకం సోషలిజాన్నే. దేశ అత్యున్నతాధికార సంస్థ అయిన సోవియట్ యూనియన్ ప్రజాప్రతినిధుల మహాసభకు యిటీవల జరిగిన ఎన్నికల్లో యీ క్రమం కొట్టవచ్చినట్టు కనిపించింది.

లెనినిస్టు సరళిలో నిజాయితీ పట్ల, బాహాటతపట్ల యెంతో ఆసక్తిని, చిత్తశుద్ధిని కనబరుస్తూ సమాజం ప్రతిస్పందించింది. అనేక సంవత్సరాలుగా పేరుకపోయిన తమ సమస్యలను మౌనంగా దిగమింగిన ప్రజలు యిప్పుడు తేరుకొని వాటిని గురించి బాహాటంగా మాట్లాడుతున్నారు. కానీ పెరిస్త్రోయికా పథం సులభమైనదీ, ఒడిదుడుకులు లేనిదీకాదు. 1989 ఫిబ్రవరి 23న కీవ్‌లో జరిగిన శ్రామిక ప్రజల సమావేశంలో యీ అంశాన్ని మిహయీల్ గోర్బచేవ్ నొక్కి చెపుతూ యిలా అన్నారు: "మనం ఒక మహత్తర నూతన పథకాన్ని చేపట్టాం. దాన్ని నెరవేర్చడానికి సాహసోపేతమైన, సువ్యవస్థితమైన అన్వేషణా, సాంప్రదాయేతర పరిష్కారాలూ, పద్ధతులూ మాత్రమేకాక ధైర్యం కూడా కావాలి. సోషలిజం తాలూకు కాలం చెల్లిన భావనల వల్ల వుత్పన్నమైన పాత ఆచరణలను వదిలించుకునే ధైర్యం మనకు వుండాలి. అంతేకాదు, సోషలిజం విలువలను పెరిస్త్రోయికా లక్ష్యాలను చులకనచేసి, అప్రతిష్టపాల్జేసి తద్వారా మనం యెంచుకున్న పంథానుండి మనల్ని మళ్ళించే ప్రయత్నాలను భగ్నం చేసే ధైర్యం కూడా మనకు వుండాలి."

మౌలిక ఆర్థిక సంస్కరణను, రాజకీయ వ్యవస్థ సంస్కరణను నిర్వహించే గుణాత్మకమైన నూతన దశలకు సోషలిస్టు పునర్ నవీనీకరణ క్రమం చేరుకున్నది. సమాజ పునాదిలోనూ, ఉపరి నిర్మాణంలోనూ జరిగిన సమగ్రమైన, పరస్పరసంబంధంగల పరివర్తనలు సామాజికాభివృద్ధిని ఒక గుణాత్మకమైన నూతన స్థాయికి తీసుకెళ్ళగలవు. ప్రజలకు, పార్టీకి, ప్రభుత్వానికి మధ్య వుండాల్సిన సంబంధాల గురించి లెనిన్ చేసిన బోధను, సోవియట్ యూనియన్‌లో పెరిస్త్రోయికా కింద అమలు జరుగుతున్న, అమలు జరుపతలపెట్టిన మార్పుల సందర్భంగా దృష్టిలో పెట్టుకుంటున్నారు. ప్రజలను ఆకర్షించి, సమీకరించి, వారిని వుమ్మడి ఆశయసాధనలో నిమగ్నం చేసిన లెనిన్ శక్తి సామర్థ్యాలనుండి మనం నేర్చుకోవాలి. సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని పెంపొందించే అత్యుత్తమ మార్గమిదే.

లెనిన్‌కుగల విప్లవకర నిబద్ధత తిరుగులేని మానవీయతతో నిండినది. ప్రజల సృజనాత్మక శక్తిపై ఆయనకుగల నమ్మకం అపారమైనది.

అంతర్జాతీయ సంబంధాల్లో కూడా మంచి మార్పులకు పెరిస్త్రోయికా అవకాశాలను సమకూర్చింది. ఆయుధ పోటీ క్రమం తిరుగు ముఖం పట్టింది, ఉద్రిక్తతలు క్రమక్రమంగా తగ్గుతున్నాయి. ప్రాంతీయ ఘర్షణలకు పరిష్కారాలు పొడసూపాయి. అంతర్జాతీయ సంబంధాల్లో సాధారణ స్థితి నెలకొనడం మొదలైంది. కానీ మిహయీల్ గోర్బచేవ్ ఐ.రా.స. సర్వప్రతినిధి సభ 43 వ సమావేశంలో 1988 డిసెంబరు 7 న హెచ్చరించినట్టుగానే గతకాలపు వారసత్వం, జడత్వం యింకా పనిచేస్తోంది. అనేక ఘర్షణలకు సంబంధించిన ప్రగాఢ వైరుధ్యాలు, మూలకారణాలు యింకా అంతరించి పోలేదు.

భూమ్మీద శాంతిని పరిరక్షించడం, అణుమహోపద్రవం నుండి మానవాళిని కాపాడడం, ఆయుధ పోటీని అంతం చేయడం—యిదీ యీ నాటి ముఖ్య కర్తవ్యం. శాంతి కోసం జరిగే పోరాటమూ, సామాజిక ప్రగతి కోసం జరిగే పోరాటమూ విడదీయ వీలులేనివని లెనిన్ పేర్కొన్నారు.

చెడుపై మంచితనం విజయానికి, చీకటిపై వెలుగు విజయానికి లెనిన్ భావాలు మార్గదర్శకంగా వుంటున్నాయి. స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం, సామాజిక న్యాయం కోసం శ్రామిక ప్రజలు విప్లవ కార్యాచరణకు పూనుకోడానికి ప్రేరేపించిన ధృవతారగా ఆయన భావాలు వున్నాయి. ఇకముందు వుంటాయి.

# సోవియట్-భారత రాజకీయ సహకారాభివృద్ధి, భవిష్యదవకాశాలు

సోవియట్, భారత సంబంధాల చరిత్ర యావత్తూ అనేక దశాబ్దాలుగా సాగుతున్న ఫలప్రదమైన పరస్పర ప్రయోజనకర సంబంధాల చరిత్ర. అణ్వస్త్ర రహిత, హింసా రహిత ప్రపంచాన్ని స్థాపించడమూ, అన్ని దేశాల భద్రతకు హామీ కల్పించడమూ — యిది ప్రప్రథమ సోషలిస్టు దేశం, అలీనోద్యమ నాయక దేశాల్లో ఒకటిగా గుర్తింపు పొందిన భారతదేశం సంయుక్తంగా చేస్తున్న కృషి లక్ష్యం. అంతే కాదు, న్యాయమైన అంతర్జాతీయ ఆర్థిక వ్యవస్థను నెలకొల్పడం కూడా ఈ కృషి లక్ష్యం. ఈ సంబంధాలు విజయవంతంగా అభివృద్ధి చెందని ఒక్క జీవిత రంగం కూడ — అది రాజకీయ రంగమే కానివ్వండి, ఆర్థిక రంగమే కానివ్వండి, విజ్ఞాన శాస్త్రరంగమే కానివ్వండి, శాస్త్ర, సాంకేతిక, లేదా, సాంస్కృతిక రంగమే కానివ్వండి — లేనే లేదు.

1947 ఏప్రిల్‌లో, భారత దేశ స్వాతంత్ర్య సాధికార ప్రకటన వెలువడకముందే సోవియట్ యూనియన్, భారతదేశాల మధ్య దౌత్యసంబంధాలు నెలకొన్నాయి. యిది గొప్ప రాజకీయ ప్రాముఖ్యంగల చర్య. యిది భిన్న సామాజిక-రాజకీయ వ్యవస్థలకు చెందిన రెండుదేశాల మధ్య, సాటిలేని మైత్రీభవనం నిర్మాణానికి పునాదిరాయి అని రుజువైంది.

ఐదేళ్లపాటు అమలు జరిగే ప్రప్రథమ అంతర్ ప్రభుత్వ ఆర్థిక ఒప్పందంపై 1953 లో సంతకాలు జరగడంతో సోవియట్-భారత బహుముఖ సహకారం ప్రారంభమైంది. ఈ సంబంధాలు క్రమక్రమంగానే అయినప్పటికీ, ఏకరీతిగా యితరరంగాలకు కూడా వ్యాపించాయి.

సోవియట్ యూనియన్‌ను జవహర్‌లాల్ నెహ్రూ 1927 లో సందర్శించారు. అయితే,

## సోవియట్-భారత రాజకీయ సహకారాభివృద్ధి, భవిష్యదవకాశాలు

1955 జూన్ 7-23 తేదీల్లో ఆయన సోవియట్ యూనియన్‌ను స్వతంత్ర భారతదేశ తొలి ప్రధానిగా మొట్టమొదటిసారి అధికార హోదాలో సందర్శించారు. ఈ సందర్శన సోవియట్ భారత శిఖరాగ్ర సంభాషణలకు శ్రీకారం చుట్టింది. ఇంతగానూ ముఖ్యమైనది, అదే సంవత్సరం నవంబరు - డిసెంబరులో సోవియట్ నాయకులు ఎన్.ఎ.బుల్గానిన్, ఎన్.ఎస్. కృశ్చేవ్‌లు జరిపిన భారతదేశ పర్యటన.

ఈ రెండు సందర్శనలు ఆ తర్వాత పరస్పర సందర్శనలకూ, ద్వైపాక్షిక సమస్యల పైనా, అంతర్జాతీయ సమస్యలపైనా పరస్పర చర్చలు నిరంతరాయంగా కొనసాగడానికీ శ్రీకారం చుట్టాయి. ప్రపంచ రాజకీయాల్లోని కీలక క్షణాల్లో, ప్రత్యేకించి యిలా జరిగింది. ఈ సందర్శనా పరంపరలోని యిటీవలిది, 1988 నవంబర్ 18-20 తేదీల్లో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి, సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ అధ్యక్షవర్గ అధ్యక్షుడు అయిన మిహాయిల్ గోర్బచేవ్ అధికారపూర్వక, మైత్రీ పూర్వక భారత సందర్శన. మిహాయిల్ గోర్బచేవ్ మాటల్లో చెప్పాలంటే, "అంతర్ రాజ్యా సంబంధాల రూపబాహుళ్యంలో శిఖరాగ్ర సమావేశాలు...యెంతో అవసరమై ఒక అంశమూ, చిరకాలంగా నెలకొన్న సంప్రదాయమూను... సోవియట్-భారత శిఖరాగ్ర సమావేశాలు మన రాజ్యాలకూ, మనదేశాల ప్రజలకూ యెంతో ఉపయోగపడ్డాయి. అవి ద్వైపాక్షిక సంబంధాల భవితవ్యానికీ, అంతగానూ, అంతర్జాతీయాభివృద్ధి భవితవ్యానికీ, కూడ సదా ఊపు నిచ్చాయి."

గొప్ప ప్రాముఖ్యం గల అనేక అంతర్జాతీయ సమస్యల పట్ల భారతదేశం అవలంబించిన వైఖరులకు సోవియట్ యూనియన్ సూత్రబద్ధమైన గట్టి తోడ్పాటు నిచ్చింది. అంతర్జాతీయ రంగంలో మనకాలం నాటి. ఒక అత్యంత పలుకుబడిగల శక్తిగా,తన ప్రతిపత్తి పటిష్టతను ఒక స్వతంత్ర సార్వభౌమ రాజ్యంగా తన తొలి రోజుల్లో పెంచుకోవడంలోనూ, వలసవాదుల పరిపాలన దుష్పర్యవసానాలను అధిగమించడం లోనూ భారత దేశానికి ఈతోడ్పాటు యెంతో ముఖ్య మైనదయింది.

ఈ మండలంలో రాజకీయంగా యెంతో ఉద్రిక్తవాతావరణం నెలకొన్న పరిస్థితిలో, భారతదేశ రిపబ్లిక్కుకూ, సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్యకూ మధ్య శాంతి, స్నేహ, సహకార సంధిపై కొత్త ఢిల్లీలో 1971 ఆగస్టు 9 న సంతకాలు జరిగాయి. "రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, సాంకేతిక, విజ్ఞానశాస్త్ర రంగాల్లో సోవియట్ యూనియన్, భారతదేశాల మధ్య స్నేహసంబంధాలూ, ఫలప్రదమైన సహకారమూ విజయవంతంగా అభివృద్ధి చెందు తున్నాయి. వాటి యితోధిక విస్తరణకు గొప్ప అవకాశం వుంది. ఈ సహకారానికి గల రాజకీయ, న్యాయ,శాస్త్రపర పునాదిని సోవియట్-భారత శాంతి, స్నేహ, సహకార సంధి మరింత పటిష్ట మొనరిస్తోంది." అన్న ప్రగాఢ సంతృప్తిని 1971 ఆగస్టు 12 సోవియట్-భారత సంయుక్త ప్రకటన వ్యక్తపర్చింది.

ఈ సంధి ఉభయ దేశాల సాంప్రదాయక మైత్రీ,పరస్పర అవగాహనల పరాకాష్ట మాత్రమేకాదు ఇది పూర్తిగా కొత్త తరహా అంతర్జాతీయ పత్రం; పెద్ద పాశ్చాత్య పెట్టుబడిదారీ రాజ్యాలు వర్ధమాన దేశాలతో కుదుర్చుకున్న ఒప్పందాలన్నిటికన్నా మౌలికంగా భిన్నమైనది. యీ సంధి, మాటల్లోనేగాక చేతల్లో కూడా ఉభయపక్షాల సమాన హక్కులకు హామీ యిచ్చింది. యిది ప్రగాఢ పరస్పర గౌరవ భావంతో నిండి నిబిడీకృతమై ఉంది.

1971 డిసెంబరులో భారత-పాక్ ఘర్షణకు సంబంధించి, ఐ.రా.స భద్రతా సంఘంలో వచ్చిన భారతవ్యతిరేక ముసాయిదా తీర్మానా

## సోవియట్-భారత రాజకీయ సహకారాభివృద్ధి, భవిష్యదవకాశాలు

లను సోవియట్ యూనియన్ మూడు సార్లు వీటో చేసింది, కేవలం, ప్రకటనలు, లేక, ఓటింగులతోనే ఆగక, సోవియట్ యూనియన్ యింకా ముందుకు పోయింది. బంగాళా ఖాతా నికి పెద్దయెత్తున విదేశీ యుద్ధనౌకాదళాల తరలింపునకు సోవియట్ యూనియన్ ప్రతి స్పందించి, బయటి వారి జోక్యాన్ని నివారించడానికై తగిన చర్యలు తీసుకుంది.

ఆనాటి క్లిష్ట పరిస్థితిలో సోవియట్-భారత సంధి ఈమండలంలో ఒకముఖ్యమైన సుస్థిరత స్థాపనా కారకంగా పని చేసింది; భారతదేశ స్థానాల పటిష్టీకరణకు తోడ్పడింది; శాంతి ఆశయానికి క్రియాశీలంగా ఉపయోగపడింది. ఉభయదేశాల అనుబంధాలు, విశ్వసనీయమైన వని ప్రపంచమంతటికి స్పష్టంగా తెలిసేటట్లు ధ్రువపరచింది.

అయితే, ఈ సంధి ఆసమయంలో యెంత ఫలప్రదంగా ఉండినా, ఈ మండలంలో పరిస్థితిపైనా, ఉభయదేశాల మధ్య సహకార యితోధికాభివృద్ధిపైనా అది అత్యంత సాను కూల ప్రభావం నెరపినది శాంతి కాలంలోనే తప్ప, యుద్ధ కాలంలో కాదు. శాంతి, స్నేహ, సహకార సంధి సైనిక సంధికాదు. దీని లక్ష్యం శాంతిని పటిష్టమొనరించడమే. ఇది తన నిర్దేశాల అమలుకు అత్యంత అనుకూల పరిస్థితులను సృష్టిస్తుంది.

ఆయుధ పోటీని అంతమొందిచడం; సామూహిక విధ్వంసక ఆయుధాలను నిర్మూ లించడం; శాంతికోసం, దేశాల భద్రతకోసం పాటుపడటం; సమస్త దేశాల ప్రజల జాతీయ సార్వభౌమాధికారాన్నీ తమ అభివృద్ధి మార్గా న్నీ తామే స్వతంత్రంగా ఎంచుకునేందుకు వారికి గల హక్కునూ గౌరవించడం; వలస వాద, నయావలసవాద అవశేషాలను కూకటి వేళ్ళతో పెళ్ళగించడం—యిలాంటి అత్యంత ప్రాధాన్యంగల సమస్యలను పరిష్క రించడంలో సోవియట్ యూని యన్, భారతదేశాలు శాంతి, స్నేహ, సహకార సంధికి అచంచలంగా కట్టుబడి ఉంటూ అంతర్జాతీయ రంగంలో ఒకే రకమైన, లేదా పరస్పర సన్నిహితమైన వైఖరుల ప్రాతిపదికపై ముందుకు సాగుతున్నాయి.

శాంతిని పటిష్టమొనరించి, అణు మహో పద్రవ ప్రమాదాన్ని తొలగించడమే నేడు మానవాళి ముందున్న అతి ప్రధానమైన గమ్య మని సోవియట్ యూనియన్, భారతదేశాల దృఢ విశ్వాసం.

ఈ విశ్వాసంతో, ఈ మహత్తర గమ్య సాధనకు దోహదం చేయాలన్న కృతనిశ్చయంతో ముందుకు సాగుతూ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి మిహ యీల్ గోర్బచేవ్, భారతదేశ ప్రధానమంత్రి శ్రీరాజీవ్‌గాంధీ అణ్వస్త్రరహిత, హింసారహిత ప్రపంచ సూత్రాల గురించిన ఢిల్లీ ప్రకటనపై గోర్బచేవ్ భారతదేశ పర్యటన సమయంలో **1986** నవంబరు **27** న సంతకాలు చేశారు. ఈ ప్రకటనను ఆదరంతో స్వీకరించవల సిందిగా సోవియట్, భారత దేశనాయకులు ప్రపంచంలోని సమస్త దేశాలకు సూచించారు; అణ్వస్త్ర విసర్జనకై, విశ్వశాంతికై శాయశక్తులా పాటుపడ వలసినదిగా వాటికి విజ్ఞప్తి చేశారు.

"ఢిల్లీ ప్రకటనలోని నూతన రాజకీయ ఆలోచనా ధోరణికి సంబంధించిన సూత్రాలు ప్రపంచమంతటా అతకంతకూ విస్తృతమైన ప్రతిస్పందనను రేకెత్తిస్తున్నాయి," అన్న ప్రగాఢ సంతృప్తిని మిహయీల్ గోర్బచేవ్ భారతదేశంలో జరిపిన అధికార పూర్వక స్నేహ పర్యటన ముగిసినప్పుడు, **1988** నవంబరు **20** న జారీ అయిన సోవియట్-భారత శిఖరాగ్ర సమావేశ ప్రకటన వ్యక్తం

(మిగతా 58 వ పేజీలో)

# నూతన రాజకీయ ఆలోచనా ధోరణీ, ప్రాంతీయ ఘర్షణలు



డాక్టర్ అలెగ్జాండ్ర్ కిస్లోవ్ (చరిత్ర)

సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ తాలూకు ప్రపంచ ఆర్థిక వ్యవస్థ, అంతర్జాతీయ సంబంధాల ఇన్‌స్టిట్యూట్ డిప్యూటీ డైరెక్టర్.

ప్రపంచాన్ని అణుయుద్ధ ప్రమాదం నుంచీ విముక్తం చేసేందుకు నేడు నిజమైన తొలిచర్యలు తీసుకోబడుతున్నందువల్ల, ప్రాంతీయ ఘర్షణలను నిర్మూలించవలసిన తక్షణావశ్యకత ప్రత్యేకించి ప్రస్ఫుటంగా వ్యక్తమవుతోంది. అత్యంత భిన్నమైన "ఉద్రిక్త ప్రాంతాల"లోని ప్రాంతీయ ఘర్షణల శాంతియుత పరిష్కారం లక్ష్యంగా గల విధానంలో నూతన ఆలోచనా ధోరణి అంతర్లీనంగా ఉండాలి. ఎందుకంటే, ఇలా ఉండనిదే, శాశ్వత అంతర్జాతీయ భద్రతను గురించి ఆలోచించడం అసాధ్యం.

"ప్రజల మనసుపైనా, రాజకీయ జీవితంపైనా నూతన ఆలోచనాధోరణి ఎంత యెక్కువ ప్రభావం నెరపితే నూతన రాజకీయ పరిస్థితిని అంత త్వరగా సృష్టించడం సాధ్యపడుతుంది. ఈ పరిస్థితిలో ప్రాంతీయ సమస్యలతో సహా సమస్త వైరుధ్యాలనూ పరిష్కరించడం సులభతరమవుతుంది" అని పి.ఎల్.ఓ కార్యవర్గ అధ్యక్షుడైన యాసర్ అరాఫత్‌తో జరిగిన చర్చసందర్భంగా మిహాయిల్ గోర్బచేవ్ అన్నారు.

ప్రాంతీయ ఘర్షణలు అన్ని దేశాలకూ, ముఖ్యంగా వర్ధమానదేశాలకు ఎంతో అవసరమైన అపార పాదార్థిక వనరులను మింగేస్తున్నాయి; దేశాల సామాజిక, సాంస్కృతికాభివృద్ధిని వెనకపట్టు పట్టిస్తున్నాయి. గత దశాబ్దిలోనే వివిధ ప్రాంతీయ ఘర్షణల్లో వందలాది బిలియన్ల డాలర్లను సైనికావసరాలకోసం ఖర్చుచేయడం జరిగింది. ఎడారుల్లో నీటి పారుదల సౌకర్యం కల్పించడం ద్వారా ఆకలిని, బాధలను అధిగమించవచ్చు. విద్య ఆరోగ్యం లాంటి ఎంతో అవసరమైన లక్ష్యాల సాధనకు

ఈ మొత్తాన్ని వినియోగించవచ్చు. వీటిలో పలు ఘర్షణలు స్థానిక, అంతర్జాతీయ ఉద్రిక్తతలను పెంచుతాయి. అవి చివరికి ప్రపంచ యుద్ధానికి సైతం దారితీసే ప్రమాదముంది. ఈ ఘర్షణల్లో పాల్గొంటున్న దేశాలు అణ్వస్త్రాలు, తదితర సామూహిక విధ్వంసక ఆయుధాలను ఉపయోగించే వీలున్నందున అది ఈ ప్రమాదాన్ని మరింత పెంచుతోంది. యిందువల్ల, యితర దేశాలకు, ముఖ్యంగా ఘర్షణల సమీప దేశాలకు తక్షణ ప్రమాద మేర్పడుతోంది. ప్రాంతీయ ఘర్షణలూ, సంక్షోభాలు అంతర్జాతీయ టెర్రరిజానికి అవకాశమిస్తున్నాయి.

ప్రపంచకుటుంబం, ఆచరణాత్మక చర్యల ద్వారా సమస్త ప్రాంతీయ ఘర్షణల తక్షణ రాజకీయ పరిష్కారానికి దోహదంచేయాలి. ఈ రాజకీయ పరిష్కారం కుదరాలంటే ప్రాంతీయ ఘర్షణలపట్ల నూతన వైఖరి అవసరం. దీనికి కీలకం నూతన ఆలోచనా ధోరణిలో ఉంది. సోవియట్ యూనియన్ దీనికి తన విదేశాంగ విధాన పునాదిలో స్థానం కల్పించడమేగాక, ప్రపంచ స్థాయిలో దీన్ని అంతర్జాతీయ సంబంధాల్లో ప్రవేశపెట్టాలని కూడా సూచించింది.

## నూతన రాజకీయ ఆలోచనా ధోరణిలో ప్రాంతీయ ఘర్షణలు

సార్వత్రిక మానవవిలువలు రాజ్యాల, వర్గాల ప్రయోజనాలకన్నా భావజాల పరిగణనలకన్నా నిర్వివాదంగా ముఖ్యమైనవన్న లెనిన్ అభిప్రాయమే, నూతన ఆలోచనా ధోరణిలోని సారభూతాంశం. దీన్నుంచీ మరో ముఖ్యమైన ఆలోచన ఉత్పన్నమవుతోంది: యితర రాజ్యాల భద్రతను బలిపెట్టి ఒక రాజ్య భద్రతకు హామీ నివ్వడం అసాధ్యం. భద్రత అనేది సార్వత్రికంగా మాత్రమే ఉండ గలదు. అది ఘర్షణతో ప్రత్యక్ష సంబంధమున్న దేశాల, యితరదేశాల నిజమైన ప్రయోజనాలను సాధ్యమైనంత వరిగణనకు తీసుకుని తీరాలి. ఒక జాతి స్వాతంత్ర్య కాంక్షను సైనిక బలంతో అణచి వేయడం అసాధ్యమని గత కొన్ని దశాబ్దాల అనుభవం స్పష్టం చేసింది.

ఇప్పటికే ముందుకు వచ్చినది, "ప్రయోజనాల సమతూకమే" తప్ప, "శక్తుల సమ తూకం"కాదు. నేడు ఘర్షణ పడుతున్న పక్షాల ప్రయోజనాల సంపూర్ణ సమరసతను సాధించడం అసాధ్యం కాకపోయినా, చాలా కష్టమని వేరే చెప్పనవసరం లేదు. అయితే, సమరసత కోసం పాటుబడటం, అన్ని పక్షాల ప్రయోజనాలను సాధ్యమైనంత మేరకు పరిగణనలోనికి తీసుకుని, వాటికి ఒక ఉమ్మడి ప్రాతిపదికను కనుగొనడానికి ప్రయత్నించడం అవసరం. దీన్ని సాధించడానికై ప్రాంతీయ ఘర్షణల్లో పాల్గొంటున్న అన్ని పక్షాలు, దేశ పరమోన్నత ప్రయోజనాల కోసం సహేతుకమైన రాజీకీ, నిష్పక్షపాత చర్చల ద్వారా వివాదాలను శాంతియుతంగా పరిష్కరించుకోవడానికీ కృషినల్పాలి. ప్రాంతీయ ఘర్షణల పరిష్కారంలో జాతీయ సామరస్య విధానం నిర్ణాయక పాత్ర వహించాలని ప్రపంచం అంతకంతకూ యెక్కువగా గ్రహిస్తోంది.

ఈ భావాన్ని సోవియట్ యూనియన్ ఏక రీతిగా బలపరుస్తోంది. వలసవాదయుగంలో అలవర్చుకున్న మనస్తత్వాన్నీ పెంపొందించుకున్న భావాలనూ వదిలించుకోవడం పాశ్చాత్య నాయకులకు కూడా చాలాముఖ్యం. ఎందుకంటే, ఘర్షణలూ, సంక్షోభ పరిస్థితులూ చాలా వరకు తృతీయ ప్రపంచంలోనే తలెత్తుతున్నాయి తృతీయ ప్రపంచాన్ని పాశ్చాత్య ప్రపంచం తన ప్రాభవ మండలంగా పరిగణించినంత కాలమూ "ఉద్రిక్త ప్రాంతాలు" కొనసాగుతూంటాయి. కొత్తవి పుట్టు కొస్తాయి కూడా.

అయితే, ఈ ప్రాంతీయ ఘర్షణలనూ, ప్రాంతీయ సంక్షోభాలనూ పరిష్కరించడంలో పాశ్చాత్య దేశాలు నిర్వహించగల సానుకూల పాత్ర, కేవలం వలసవాద యుగ గతానుగతిక

పద్ధతుల పరిత్యాగానికి మాత్రమే పరిమితమై ఉండజాలదు. ప్రపంచంలోని వివిధప్రాంతాల్లో సుస్థిరతా సాధనకు పాశ్చాత్యదేశాలు సోవియట్ యూనియన్‌తో కలిసి తీసుకొనే చర్యలు, కనీసం సమాంతర చర్యలు చేయగల దోహదం తక్కువేమీ కాదని అనుభవం నిరూపిస్తోంది. సంబంధిత దేశాల న్యాయమైన ప్రయోజనాలను పరిగణనలోకి తీసుకోకుండా మాస్కో, వాషింగ్టన్‌లు నిర్ణయం చేయగలవని గానీ, ఆ నిర్ణయాన్ని వాటిపై రుద్దగలవని గాని దీనర్థం ఎంత మాత్రమూ కాదు. ఘర్షణ పడుతున్న పక్షాల రాజీ అన్వేషణకూ, చర్చలకూ మెరుగైన పరిస్థితులను సోవియట్ యూనియన్, అమెరికాలు సృష్టించగల వంతే.

ఘర్షణ పరిస్థితులను ఉపశమింపజేయడంలో ఐక్యరాజ్య సమితిలాంటి సార్వత్రిక అంతర్జాతీయ సంస్థ ముఖ్యమైన సానుకూల పాత్ర నిర్వహించగలదు. కొన్ని యంత్రాంగాలు ఇప్పటికే ఐ.రా.స. పరిధిలో ఉన్నాయి. తరచు, వీటిని ఉపయోగించుకోవడం లేదు, లేదా పూర్తి స్థాయిలో ఉపయోగించుకోవడం లేదు. యిది అంతర్జాతీయ న్యాయస్థానం, మధ్య వర్తిత్వ పద్ధతులు, ఐ.రా.స ప్రధాన కార్యదర్శి వ్యక్తిగత దూతలు, ఐ.రా.స. సాయుధ దళం మొదలైన వాటికి వర్తిస్తుంది. వీటిపాత్రను ఫలదాయకంగా పెంచడానికి సోవియట్ యూనియన్ గట్టికృషి చేస్తోంది. ఇప్పుడున్న యంత్రాంగాల ఫలదాయకతను పెంచడంతోనే సరిపోదు. నూతన యంత్రాంగాల, పద్ధతుల సమస్యకూడా నేడు ముఖ్యమైనది. ఉదాహరణకు, ఘర్షణ ప్రాంతాల్లో సైనిక పరిస్థితిని నియంత్రించే ఒక యంత్రాంగాన్ని ఐ.రా.స. ఆధ్వర్యంలో నెలకొల్పాలనీ, పర్షియా సింధుశాఖలో ఐ.రా.స నౌకాదళాన్ని ఏర్పాటు చేయాలనీ సోవియట్ యూనియన్ కొన్ని ప్రతిపాదనలు చేసింది. ప్రాంతీయ ఘర్షణలను అంతంచేసి, ఆ విధంగా ప్రపంచ పరిస్థితిని మెరుగు పర్చడంలో యీ ప్రతిపాదనలు పెద్దపాత్ర నిర్వహించగలవు.

## నూతన రాజకీయ ఆలోచనా ధోరణి, ప్రాంతీయ ఘర్షణలు

సూత్రబద్ధ వైఖరీ, వాస్తవికతల సమ్మేళనపైనా, ఘర్షణపడుతున్న సమస్త పక్షాల ప్రయోజనాలను పరిగణనలోకి తీసుకోవడంపైనా ఆధారపడిన అగ్రరాజ్యాల సహకారమూ, ఘర్షణ పడుతున్న సమస్త పక్షాలతో నిర్మాణాత్మక సహహకారమూ ఈ భావాలన్నిటినీ అమలు జరపడంలో అతిముఖ్యమైన పాత్ర నిర్వహిస్తున్నాయి. అగ్రరాజ్యాల సమ్మతి లేనిదే ఐ.రా.స. భద్రతాసంఘం కీలకనిర్ణయాలను తీసుకోజాలదు. కాబట్టి యిది మరీయెక్కువ అవసరం. గత కొన్ని నెలల్లో జరిగిన తమ ద్వైపాక్షిక చర్చల్లో అత్యున్నతస్థాయితో సహా అన్నిస్థాయిల్లోనూ మునుపెన్నడూ లేనంత మనస్ఫూర్తిగా, ప్రాంతీయ సమస్యలను అమెరికా, సోవియట్ యూనియన్‌లు పరిగణనలోకి తీసుకోవడానికి కారణం పైన పేర్కొన్న విషయాలే. ఈ దేశాలు ఈ సమస్యల పరిశీలనకు యింత సమయాన్ని వెచ్చించడం గానీ, యింతటి ఆచరణాత్మక స్ఫూర్తితో, యింత వ్యవహారసరళిలో వీటిని గురించి చర్చించడం గానీ మునుపెన్నడూ చేయలేదు.

ఆఫ్ఘనిస్తాన్‌పై జెనీవా ఒప్పందాలను రూపొందించడం, వాటిపైసంతకాలు చేయడం — యిది ప్రాంతీయ ఘర్షణలను పరిష్కరించే సమస్యపట్ల బాధ్యతాయుతమైన, సమదృష్టిగల వైఖరికి ఒక చక్కని ఉదాహరణ. ఆ సంభాషణల్లో పాల్గొని, ఒప్పందాలపై సంతకాలు చేసిన అన్ని పక్షాలు ఈ రాజకీయ పరిష్కారాన్ని సాధించడంలో నిర్వర్తించవలసిన బాధ్యలను జెనీవా ఒప్పందాలు నిర్దేశిస్తున్నాయి. ఆఫ్ఘనిస్తాన్ అంతరంగిక వ్యవహారాల్లో బేజోక్యం, అక్కడనుంచి సోవియట్ సైనికుల ఉపసంహరణ—యివి ఈ ఒప్పందాల్లోని సారభూతాంశాలు. ఇంతేకాక, ఆఫ్ఘన్ సమస్య పరిష్కారానికి మధ్యవర్తులుగా, హామీదారులుగా వ్యవహ

రించిన సోవియట్ యూనియన్, అమెరికాలకు, నిర్మాణాత్మకంగా సహకరించుకునేందుకు వరవడిపెట్టే అవకాశం కలిగింది. కుదిరిన ఒప్పందాలను ఖచ్చితంగా పాటించడంపై నేడు ఎంతో ఆధారపడిఉంది.

కాని, సోవియట్ యూనియన్, ఆఫ్ఘనిస్తాన్ ప్రభుత్వాలు తమ బాధ్యతలకు కట్టుబడి ఉండగా పాకిస్తాన్ వక్రం ఒప్పందాలను ఘోరంగా ఉల్లంఘిస్తోంది. జెనీవా ఒప్పందాలు కుదరడం వల్ల ఆఫ్ఘన్ ప్రజలకు శాంతిసౌభాగ్యాలు చేకూరేందుకే కాక ఈ మండలంలో పరిస్థితులు కుదుటపడేందుకు చరిత్రాత్మక అవకాశం ఆవిష్కృతమైంది యితర ప్రాంతీయ ఘర్షణలను రాజకీయంగా పరిష్కరించే సాధనాలనూ, పద్ధతులను ఈ ఒప్పందాలు స్పష్టంగా చూపుతున్నాయి. జాతీయ సామరస్యం ఈ పరిష్కారానికి ప్రాతిపదిక కావడంవల్ల, మిశ్రమ ప్రభుత్వం స్థాపనా, మొదలగు భావాలు, ఆఫ్ఘనిస్తాన్ చుట్టూ పరిస్థితిని కుదుటపర్చేమార్గాల అన్వేషణలో ముందుకు వచ్చాయి. ఆఫ్ఘన్‌ప్రభుత్వం వీటిని ఆచరణలో పెట్టడానికి నిర్దిష్టచర్యలను తీసుకుంటోంది.

## నూతన రాజకీయ ఆలోచనా ధోరణి, ప్రాంతీయ ఘర్షణలు

కొన్ని సమయాల్లో అంతర్యుద్ధంగా పరిణమించగల తీవ్ర ఆంతరంగిక వైరుధ్యాలు రేపిన ఘర్షణలు, ఘర్షణ పడుతున్న పక్షాల రాజీతో ముగిసిన సందర్భాలు చరిత్రలో లేవు. కాని, జాతీయ సామరస్య భావం అంతకంతకు ప్రజల అండదండలు పొందటంతో ఈ విధమైనరాజీ కుదరాలని నిర్ణయించడం జరిగింది. ఏదో ఒక రూపంలో జాతీయ సామరస్యానికి తగిన పరిస్థితులను కల్పించే ధోరణి బలపడుతున్నది, కేవలం ఆఫ్ఘనిస్తాన్ లోనే కాదు.

కంపూచియా ప్రజారిపబ్లిక్ ప్రధానమంత్రి హున్‌సేన్‌కూ, ప్రిన్స్ నరోదం సిహనౌకుకూ మధ్య జరుగుతున్న సంభాషణలు కంపూచియా సమస్య రాజకీయ పరిష్కారానికి తప్పకుండా తోడ్పడుతున్నాయి.

నికరాగ్వాలో ఘర్షణపడుతున్న పక్షాలు కూడా క్రమంగా ఒకదానికొకటి దగ్గరగా రావడానికి చర్య తీసుకున్నాయి. ఆఫ్రికా దక్షిణాదిలో కూడా రాజకీయ పరిష్కారానికి నూతన రూపాలూ, పద్ధతులను కనుగొనడంలో కొన్ని సానుకూలమైన మార్పులు వచ్చాయి.

పోతే, అరబ్—ఇజ్రాయిల్ ఘర్షణ ప్రపంచంలో అన్నిటి కన్నా దీర్ఘకాలంగా సాగుతూంది. మధ్యప్రాచ్యంలో ఇటీవలి ఘటనల వల్ల, ప్రత్యేకించి, **1967** లో ఇజ్రాయిల్ ఆక్రమించుకున్న ప్రాంతాలలో పాలస్తీనియన్ ప్రజల తిరుగుబాటులవల్ల అరబ్—ఇజ్రాయిలీ ఘర్షణ యావత్ప్రపంచ ప్రజలదృష్టినాకర్షించింది. అక్కడి ఉద్రిక్తతలు మొత్తం అంతర్జాతీయ పరిస్థితిపై ప్రతికూల ప్రభావాన్ని నెరపుతున్నాయి. కానీ, ఇప్పుడు మధ్యప్రాచ్యంలోని పరిణామాల్లోకూడ స్థూలంగా సానుకూలమైన ధోరణులు కనిపిస్తున్నాయి. సంబంధిత పక్షాలన్నిటి ప్రయోజనాలను పరిగణనకు తీసుకుని అరబ్-ఇజ్రాయిలీ సంఘర్షణకు తక్షణమే సమగ్ర రాజకీయ పరిష్కారాన్ని కనుగొనడం అవసరమని ప్రపంచప్రజలు అంతకంతకు గుర్తిస్తున్నారు. ఈ పక్షాలు బాధ్యతయుతవైఖరితో ప్రవర్తిస్తే, నూతన రాజకీయ ఆలోచనా సూత్రాలను ఆచరణాత్మక విధానంలో దౌత్యనీతిలో అమలు జరిపితే, తలపాటును వదులుకొని ప్రస్తుత సమస్యలకు పరస్పర అంగీకారయోగ్యమైన పరిష్కారాలను కనుగొనేందుకు ప్రయత్నం జరిగితే ఈ ప్రాంతంలోకూడ న్యాయమైన, సుస్థిరమైన శాంతి స్థాపనవైపు మొగ్గురాగలదని చెప్పవచ్చు.

మధ్యప్రాచ్యంపై ఐ.రా.స అధ్వర్యాన అంతర్జాతీయ సమావేశం జరపడమొక్కటే ఈ ఘర్షణను పరిష్కరించే మార్గం అన్న అభి

ప్రాయానికి తోడ్పాటు పెరగడం దీన్ని ధ్రువ పరుస్తున్నది. అరబ్బు రాజ్యాలు, పశ్చిమ యూరోపుదేశాలు, పలుకుబడి గలిగినకొన్ని అంతర్జాతీయ సంస్థలు ఈ భావాన్ని ఏక గ్రీవంగా బలపరుస్తూ చెపుతున్నదిదీ: భద్రతా సంఘంలోని ఐదుశాశ్వతసభ్యదేశాలూ, పాలస్తీనా విమోచనా సంస్థతో సహా ఈఘర్షణతో ప్రత్యక్షసంబంధమున్న అన్ని పక్షాలూ పాల్గొనే అటువంటి అంతర్జాతీయ సమావేశం త్వరలో జరగాలి. మాస్కో శిఖరాగ్ర సమావేశంలో ఉభయపక్షాలూ ఈ సమస్యపై తమ వైఖరులలో సాన్నిహిత్యమున్నట్లు ప్రకటించాయి. ప్రతిపా దిత అంతర్జాతీయ సమావేశాన్ని జరిపి, సంబంధింత ఐ.రా.స తీర్మానాలను అమలు జరపవలసిన అవసరాన్ని అవి గుర్తించాయి.

ప్రాంతీయ ఘర్షణల పరిష్కారంలో నూతన రాజకీయ ఆలోచనా ధోరణి నిర్వహించగల పాత్రను గురించి మాట్లాడు తున్నప్పుడు, ఇప్ప టికే ఉన్న ఘర్షణలు సడలింపజేసె భావాల నూ, చర్యలనూ పరిశీలించడమొక్కటే చాలదు. భవిష్యత్తులో ప్రాంతీయ ఘర్షణలు తలయెత్తకుండా నివారించే చర్యల సంగతి కూడా ఆలోచించాలి. ఎందువల్లనంటే అటువంటి ఘర్షణలు అంతకంతకు తీవ్రమౌతూ ఎంద రెందరి ప్రాణాలనో బలిగొంటున్నాయి. అవి ప్రమాదకరమైన ప్రపంచ వ్యాప్త పర్యవసానా లకు దారితీయవచ్చు. అగ్రరాజ్యాలు యితర దేశాలతో కలిసి, వర్తమానప్రాంతీయ ఘర్షణలు, సంక్షోభపరిస్థితులు తీవ్రరూపం ధరించే ఆస్కారం లేకుండా చేయడానికీ, కొత్తవి తలయెత్తకుండా నివారించడానికీ నిర్దిష్ట ప్రవర్తనా సూత్రాలను రూపొందించడం లోసానుకూల పాత్ర వహించ గలవు.

సర్వత్రా గుర్తింపబడిన అంతర్జాతీయ న్యాయశాస్త్ర ప్రమాణాలను ఖచ్చితంగా పాటించడానికి నిబద్ధమై ఉండటం ఎంత ముఖ్యమో, ప్రాంతీయ ఘర్షణలలో ప్రవర్తనా నియమావళికి నిబద్ధత అంతముఖ్యం. ఈ నియమావళిలో కింద పేర్కొన్నలాంటి నిర్దిష్ట నిబంధనలను చేర్చవచ్చు. రాజీ ప్రాతిపదికపైన అన్ని సంబంధిత పక్షాల న్యాయమైన ప్రయో జనాలను పరిగణనలోకి తీసుకుని ఘర్షణలనూ, సంక్షోభాలనూ రాజకీయ పద్ధతులద్వారా మాత్రమే పరిష్కరించవలసిన అవసరాన్ని గుర్తించడం; విప్లవ, విప్లవప్రతీఘాతాల ఎగు మతినీ, ఘర్షణపడే దేశాల్లో అంతర్గత రాజకీయ పరిస్థితిని అస్థిరీకరించే చర్యలనూ విసర్జించడం; వర్ధమానదేశాల భూభాగంపై కొత్త స్థావరాల స్థాపననూ, ఈ మండలంలో సామూహిక విధ్వంసక ఆయుధాల మోహరింపునూ మానుకోవడం; నాటో, వార్సా సంధి సంస్థల కార్యకలాపాల విస్తరణనూ, ఈ సంస్థల్లోకి వర్ధమాన దేశాలను లాక్కొచ్చే ప్రయ త్నాలనూ విసర్జించడం; ప్రాంతీయ ఘర్షణల, సంక్షోభ పరిస్థితుల పరిష్కారానికై ఐ.రా.స. యంత్రాంగాన్ని బలపరచే నిర్దిష్ట చర్యలను రూపొందించడం; సమస్యలపరిష్కారంలో ఇస్లామిక్ సమావేశ సంస్థ, అమెరికన్ రాజ్యాల సంస్థ, అరబ్‌లీగ్ వంటి ప్రాంతీయ సంస్థలకు క్రియాశీల పాత్ర వుండేలా చూడటం. ఇంకా ఇటువంటి నిబంధనలను మరికొన్ని ప్రతిపాదిత ప్రవర్తనా నియమావళిలోకి చేర్చవచ్చు.

**నూతన రాజకీయ ఆలోచనా ధోరణీ, ప్రాంతీయ ఘర్షణలు**

ప్రస్తుత ప్రాంతీయ ఘర్షణల పరిష్కారంలో, కొత్తవాటి నివారణలో నూతన ఆలోచనా ధోరణి సృష్టిస్తున్న అవకాశాలను ఉపయోగించుకోనీ కుండా చేసే అవరోధాలు ఎన్నో ఉన్నాయి. కానీ, ఈ సమస్యల పరిష్కారంపట్ల మానవాళి పాతవైఖరిని ఇక అవలంబించ జాలదు. ప్రాంతీయ ఘర్షణల పరిష్కారానికి నూతన ఆలోచనా ధోరణి విస్తారమైన అదనపు అవకా శాలను ఆవిష్కరిస్తోంది.

# లెనినూ, సోషలిస్టు ప్రజాస్వామ్యం

వాదిమ్ రొగోవిన్
డి.ఎస్సి (తత్వశాస్త్రం)

సోవియట్ జ్నానియె ప్రచురణాలయం వారు "శాస్త్రీయ కమ్యూనిజం" సీరీస్‌లో "మానవాంశం, గతంనుండి గుణపాఠాలు" అనే చిన్న పుస్తకాన్ని విడుదల చేశారు. ప్రముఖ సామాజిక శాస్త్రజ్ఞుడు వాదిమ్ రొగోవిన్ రాసిన యీ పుస్తకం సోవియట్ సమాజం, వివిధ దశల్లో యెదుర్కొన్న సామాజిక, నైతిక సమస్యలను వివరిస్తోంది. ఆ సమస్యల్లో కొన్నిటిని యీ వ్యాసం తెలియజేస్తోంది.

సోషలిస్టు నిర్మాణ కర్తవ్యాలు అక్టోబరు విప్లవానంతర దశాబ్దాల్లో కన్నా ఆ విప్లవం జరిగిన వెనువెంటనే కొంతమేరకు సులభంగా పరిష్కారమైనాయి. యిది విపరీతంగా కనిపించవచ్చు. అప్పుడు సోషలిస్టు అభివృద్ధి శీఘ్రగతికి మిలియన్లాది ప్రజలకు సోషలిజం పట్లగల ఆకాంక్షే కారణం. సామాజిక న్యాయ సూత్రాలపై సమాజాన్ని పునర్ నిర్మించాలనే భావన ప్రజలకు ప్రేరణనిచ్చింది. మానవ చరిత్రలో మొట్టమొదటిసారిగా సోషలిజంభావన వాస్తవరూపం ధరించసాగింది. మానవజాతిలోని వుత్తమోత్తములు విశదీకరించిన, కొన్ని తరాల విప్లవకారులు వీరోచిత పోరాటాలద్వారా ముందుకు తెచ్చిన సోషలిస్టు ఆలోచనలు పెద్దయెత్తున ప్రజలను ఆకర్షించాయి. చెప్పాలంటే కోటానుకోట్లమంది తమ జీవితానికి తామే అధినాధులమని మొట్టమొదటిసారిగా అనుభూతిని పొందారు.

## ఉపయుక్తమైన పరిష్కారాల కోసం అన్వేషణ

చారిత్రక నిర్మాణంలో అక్టోబరు విప్లవం ఒక మహత్తర క్రమానికి నాంది పలికింది. సామాజిక కార్యకలాపాల ఎరుకతో ప్రజలు యీ నిర్మాణంలోకి స్వచ్ఛందంగా ప్రవేశించారు. జనాభాలోని అత్యధికులు పెటీబూర్జువా వర్గాలుగా వున్న యీదేశంలో నూతన తరహా వ్యక్తిత్వాన్ని తీర్చి దిద్దసాగారు.

శ్రామిక ప్రజల ప్రధాన శత్రువులను (విప్లవం స్వాధీనం చేసుకున్న సంపదను తిరిగి

పొందడానికి రక్తపాతాన్నే యెంచుకున్న దోపిడీ దార్లు, స్వలాభంకోసం ప్రభుత్వ ఆస్తిని ఆక్ర మించుకున్న దగాకోర్లు, అక్రమార్జనా పరులు, డబ్బుస్వాహా చేసినవాళ్ళు) హింసతో యెదు ర్కొక తప్పదనే నమ్మకం; వీటితో పాటు ప్రజల్లో సామాజిక సంబంధాల నూతన రూపాలు అదే సమయంలో పెంపొందసాగాయి. యీ ప్రజలు ఒకే ఒక, మహత్తర, సామాజికంగా గురుతరమైన లక్ష్యంతో ఐక్యమైయ్యారు. శాంతికాలపు సోషలిస్టు నిర్మాణంలోనూ, ప్రగతి శీల సామాజిక వెల్లువల వల్ల జాతీయ, సామాజిక విముక్తికోసం జరిపిన న్యాయమైన యుద్ధాలవల్ల ఉత్పన్నమైన తీవ్ర పరిస్థితుల్లోనూ ప్రజలు సామాజిక సంలగ్నతను, తరగని వుత్సాహాన్ని కనబర్చారని తొలిరోజులనాటి సోవియట్ చరిత్ర తెలియజేస్తోంది.

పార్టీ ప్రోది చేసుకున్న విస్తృతమైన రాజకీయ, నైతిక శక్తిస్తోమతలు, సోషలిస్టు ప్రజాస్వామ్యానికి ముఖ్యంగా పార్టీ అంతరంగిక ప్రజాస్వామ్యానికి సారవంతమైన క్షేత్రంగా పనిచేశాయి. సోషలి జాన్ని నిర్మించడానికి యేకైక సాధ్యమైన మార్గంగా యిది వుండింది.

నాయకత్వ కేంద్రీకరణ కచ్చితంగా వుండా ల్సిన అంతర్యుద్ధ సమయంలో పార్టీ అంత రంగిక ప్రజాస్వామ్యాన్ని పూర్తి స్థాయిలో అమలు జరుపలేదు. అయినప్పటికీ ఆ కాలంలో రాజకీయాలు, ఆర్థిక, నైతిక విషయాలు, విజ్ఞానశాస్త్రం, సంస్కృతి, కళలపై ఉత్సాహ పూరితమైన, నిర్మాణాత్మకమైన చర్చలతో పార్టీ జీవితం నిండి వుండిందని విప్లవానంతర తొలికాలపు పత్రికలు తిరిగేసిన వారికెవరికైనా విదితమౌతుంది. సోషలిస్టు నిర్మాణ సిద్ధాంత ఆచరణలకు సంబంధించిన తక్షణ, దీర్ఘకాలిక ప్రధానసమస్యల పరిష్కార పద్ధతులపై చర్చ జరగకుండా లెనిన్‌కాలంలో జరిగిన యే ఒక్క పార్టీ మహాసభ కూడా ముగియలేదు.

లెనిన్‌కాలంలో పార్టీ అంతరంగిక వాదోప వాదాల స్వభావం గురించి ప్రత్యేకంగా పేర్కొ నాల్సివుంది. పార్టీ అంతరంగిక విభేదాల



వాదిమ్ రొగోవిన్

పరిష్కారం కోసం వర్గశత్రువులకు వ్యతిరే కంగా జరిపే సైద్ధాంతిక పోరాట పద్ధతులను పార్టీ కామ్రేడ్స్‌పై యేమాత్రం వుపయోగించ కూడదనే ఆచారానికి లెనిన్ అధిక ప్రాధాన్యతనిచ్చారు.

"పార్టీ పరిష్కరించిన యేవో కొన్ని సమస్యలపై తమ అనమ్మతిని తెలిపే కామ్రేడ్స్‌పై యెలాంటి అణచివేత అయినా సరే అనుమ తించవీలులేదు" అని పార్టీ అంతరంగిక జీవిత సూత్రాన్ని 1921లో ఆర్.సి.పి (బి) [రష్యన్ కమ్యూనిస్టు పార్టీ (బోల్షేవిక్స్)] పదవ అఖిలరష్యన్ మహాసభ ధ్రువీకరించింది. ఆరో జుల్లో అణచివేతలంటే రాజకీయ, పరిపాలనా పద్ధతుల్లో జరిపే అణచివేతలు కావు. అవి క్రమశిక్షణాచర్యలు మాత్రమే. (పార్టీ నుండి తొలగించడం, బహిష్కరించడం వగైరా)

పార్టీ అంతరంగిక ప్రజాస్వామ్యంపై గల పరిమితులను రద్దు చేయాల్సిన ఆవశ్యకతను పార్టీ ఆర్గనైజేషన్‌కు సంబంధించిన తీర్మానంలో పార్టీ పదవ మహాసభ పేర్కొంది. యుద్ధ పరిస్థితులవల్ల విధించిన యీ పరిమితులను అంతర్యుద్ధం ముగింపు సమయంలో తొలగించాలని పార్టీ నిర్ణయించింది. "యీ

# లెనిన్, సోషలిస్టు ప్రజాస్వామ్యం

కేంద్రీకరణ బ్యూరాక్రటిక్ పద్ధతులకు దారితీసే ధోరణిని పెంచింది; ప్రజాబాహుళ్యం నుండి పార్టీని విడదీసింది; పోరాట వుత్తర్వుల వ్యవస్థ తరచు వత్తిడి చేసేందుకు తోడ్పడే అవాంఛనీయ వికృతరూపాలను సంతరించుకున్నది; ప్రత్యేక హక్కులు వలురకాల దుర్వినియో గానికి దారితీసాయి; పార్టీ సంస్థల తగ్గింపు వల్ల పార్టీ ఆత్మిక జీవనం బలహీన పడడానికి దారితీసింది. యింకా యిలాంటివి యెన్నో జరిగాయి'' అని ఆ తీర్మానం పేర్కొన్నది. పార్టీ అనుసరించిన సైనికీకరణ విధానానికి బదులుగా పార్టీ అంతరంగిక కార్మిక ప్రజాస్వామ్య పంథాను మహాసభ ప్రతిపాదించింది.

పార్టీ ఆర్గనైజేషన్ గురించిన తీర్మానంలో ప్రధాన అంశంగా పేర్కొన్న కార్మికుల ప్రజాస్వా మ్యానికి సంబంధించిన భావాలను "పార్టీ ఐక్యత గురించి'' మహాసభ ఆమోదించిన మరో తీర్మానంలో నిర్దిష్టంగా పేర్కొనడం జరిగింది. ముఠా తత్వాన్ని నిర్మూలించడానికి చర్యలను కూడా ఆ తీర్మానం వివరించింది. ముఠా తత్వానికి పాల్పడ్డ కేంద్ర కమిటీ సభ్యు లను తొలగించే అధికారం కేంద్రకమిటీ ప్లీ నరీ సమావేశాలకు యీ తీర్మానం ద్వారా లభించింది. అయితే తీర్మానంలోని యీ పేరాను బయటికి పొక్కనీయకూడదని అను కున్నారు.

పదవ మహాసభ సమయంలో పార్టీ యోధుల సమావేశం జరిగింది. క్రొన్‌స్తాద్ తిరుగుబాటు కారణంగా యేర్పడిన తీవ్ర పరిస్థితి దృష్ట్యా యీ పేరాను తీర్మానంలో చేర్చవలసి వచ్చిందని ఆ సమావేశంలో లెనిన్ ప్రసంగించారు: "ప్రమాదకరమైన పరిస్థితిని దృష్టిలో పెట్టుకుని ప్రత్యేకంగా ఆమోదించిన తీవ్రచర్యయిది... మనం దీన్ని వర్తింపజేసే పరిస్థితి రాదని ఆశిస్తున్నాను.''

లెనిన్ లేకుండా జరిగిన మొట్టమొదటి పార్టీ సమావేశంలో స్టాలిన్ యీ పేరాను బయట పెట్టాడు. తర్వాత కొత్త ప్రతిపక్షం తలెత్తినప్పుడల్లా ఆ పేరా ప్రకారం చర్య తీసుకుంటానని దాని నాయకులను బెదిరించాడు.

పదవ మహాసభ పార్టీ అంతరంగిక ప్రజా స్వామ్యంపై ఆమోదించిన తీర్మానాలను చాలా వరకు లెనిన్ అనారోగ్య కారణాలవల్ల అమలు జరగలేదు. 1921 చివర్లో లెనిన్ అనారోగ్య కారణాల వల్ల విశ్రాంతి తీసుకొన్నారు. 1922 సంవత్సరం మొత్తంలో ఆయన కొన్ని నెలల పాటే పార్టీ కార్యకలాపాల్లో పాల్గొన్నారు.

పార్టీ అంతరంగిక జీవితాన్ని ప్రజాస్వామ్యీ కరించడానికీ, పార్టీ నాయకుల చిన్న బృందం చేతుల్లో అపరిమితంగా కేంద్రీకృతమైవున్న అధికారాన్ని వికేంద్రీకరించడానికీ వస్తుగత అవకాశాలు పొడచూపిన సమయంలో పార్టీ ప్రజాస్వామ్యయుత అభివృద్ధికి చారిత్రక అనిశ్చిత పరిస్థితుల వల్ల, ముఖ్యంగా లెనిన్ విశ్రాంతి తీసుకోవాల్సిన పరిస్థితుల వల్ల అవరోధమేర్పడడం పార్టీకి తీవ్ర విషాదంగా పరిణమించింది. లెనిన్ తన చివరి రోజుల్లో చేసిన రచనల్లో విప్లవ ఆశయానికి తీవ్ర ప్రమాదం యెటువైపునుండి ఆసన్నమైందో తెలిపేందుకు ప్రత్యేక శ్రద్ధ తీసుకొన్నారు. యీ బృందంలో చిన్న ఘర్షణచాలు—అది దాని ప్రతిష్ఠను నాశనం చేయక పోవచ్చునేమోకాని — అన్ని సందర్భాల్లోనూ విధాన నిర్ణాయక శక్తి కోల్పోయేంతటి బలహీనంగా దాన్ని దిగజా ర్చడానికి" అని అన్నారాయన

ఈ "చిన్న బృందం'' లోని వ్యక్తులు తమతమ జీవితంలో, రాజకీయ వ్యవహారాలు నడపడంలో, కార్యకలాపాల్లో, నైతిక గుణాల్లో యెంతోవైవిధ్యం గలవారు. ప్రజలను ఆకర్షించి, సమీకరించి వారిని సంయుక్త కృషిలో నిమగ్నం చేయడానికి లెనిన్‌కు గలశక్తే యీ చిన్న బృందం ఐక్యతను సాధ్యం చేసింది. ఆరోగ్య రీత్యా తాను విరమించు కుంటే యీ చిన్న బృందంలోని అపకేంద్ర



గోర్కీహిల్స్‌లోని భవనంలో వి.ఐ.లెనిన్. ఆగస్టు 1922

శక్తులు సృష్టించే ప్రమాదం లెనిన్‌కు బాగా తెలుసు. అందువల్ల పార్టీ ఆంతరంగిక ప్రజా స్వామ్యాన్ని పటిష్టమొనర్చే పద్ధతుల గురించి చెప్పడం అవసరమనుకున్నారు. పార్టీలో, దాని కేంద్రకమిటిలో చీలికలు రాకుండా నివారించ గల మార్గం యీ ప్రజాస్వామ్యమే. యిందు కోసం ఆయన యెన్నో లేఖలను, వ్యాసాలను డిక్టేట్ చేశారు. "మహాసభకు లేఖ" అందులో ముఖ్యమైనది. యీ లేఖను 30 సంవత్సరాల పాటు వెలుగులోకి రాకుండా చేశారు. యీ కాలంలో దీనికి వక్రీకరణలతో చేయగల వ్యాఖ్యానాలన్నీ చేశారు. లెనిన్ రాజకీయ ఆదే శంగా ప్రసిద్ధగాంచిన యీ లేఖ కేంద్ర కమి టీని నడిపే బృందంలోని సంబంధాలు, అపరి మిత అధికారాన్ని అప్పటికే కేంద్రీకరించుకు న్న స్టాలిన్‌లోని ·వ్యతిరేక ధోరణులు పార్టీలో చీలికకు దారితీయ వచ్చునని తెలియ జేసింది. ఈ పరిస్థితులే పన్నెండవపార్టీ మహాస భకు (1923) కొన్ని సిఫారసులు చేయడానికి లెనిన్‌ను పురిగొల్పాయి.

మొదటిది, గతంలో చేసిన పొరపాట్లకు పార్టీ నాయకులను దూషించే అలవాటు తగదని ఆయన హెచ్చరించారు. గత రచనల్లోకూడా ఆయన యీ అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఉదాహరణకు అక్టోబరు విప్లవానికి కొద్ది రోజులు ముందు ఆ తర్వాత నాయకులు చేసిన పొరపా ట్లను 1920 లో ఆయన గుర్తు చేశారు: "రష్యా లోని చాలా మంచి కమ్యూనిస్టులు కొందరు... పైనపేర్కొన్న సమయంలో జినోవియేవ్, కామనేవ్, రైకోవ్, నోగిన్, మిల్యుతిన్ లాంటి ప్రముఖ బోల్షె విక్కులు, కమ్యూనిస్టులు కొందరు ఊగిసలాడారు, బోల్షెవిక్కులు తమనుతాము మితిమీరి ఏకా




1918 రాజ్యాంగచట్టపు ముఖపత్రం

కులుగా చేసుకుంటున్నారని, తిరుగుబాటుకు సాగడంలో తలకుమించిన ప్రమాదాన్ని తెచ్చి పెట్టుకుంటున్నారనీ, పార్టీలోని, ప్రభుత్వం లోని బాధ్యతా యుతమైన పదవులన్నిటికీ రాజీనామా చేశారు... కానీ కొన్ని వారాల తర్వాత—మహాఅయితే కొన్ని నెలలతర్వాత—యీ కామ్రేడ్స్ తమ తప్పును గుర్తించి తమ పదవుల్లో, పార్టీలోని సోవియట్లలోని కొన్ని అత్యంత బాధ్యతాయుతమైన పదవుల్లో తిరిగి చేరారు.'' లెనిన్ యీ విషయంలో పేర్కొన్నదేమంటే పూర్తిగా సరిదిద్దబడిన పొరపాట్లను గుర్తు చేయడం తప్పు.

రెండవది; ''మన రాజకీయ నిర్మాణ స్వరూపంలో'' సంస్కరణకోసం ''అనేక మార్పులను'' చేయాలని లెనిన్ సూచించారు. ''అపరిమితమైన ప్రాధాన్యతను సంతరించుకునేందుకు కేంద్ర కమిటీలోగల చిన్నవిభాగాల మధ్య జరిగే ఘర్షణలనుపార్టీభవిష్యత్తుకోసం నివారించడం'' అవసరమని ఆయన సూచించారు. ఆ సంస్కరణవల్ల ''మన పార్టీ స్థిరత్వం వెయ్యిరెట్లు పెరుగుతుంద''న్నారు. క్యాడర్స్‌కు సంబంధించిన సమస్యపై మహాసభకు లెనిన్ యిచ్చిన ఒకే ఒక నిర్దిష్ట సలహా యీ లేఖకు సంబంధించిన ప్రసిద్ధ చేర్పులో వుంది. స్టాలిన్‌ను ప్రధాన కార్యదర్శి పదవి నుండి, యేమంత అధికార కేంద్రీకరణ లేని పదవికి మార్చాలని ఆయన సిఫారసు చేశారు.

ఈ సిఫారసులు అమలు జరపకుండా, 1923 ఏప్రిల్‌లో 12 వ పార్టీ మహాసభ దృష్టికి వీటిని తేకుండా నాటకీయ ఘటనల పరంపర ఒకటి నిరోధించింది. 1923 మార్చి 6 న ఆరోగ్యం విషమించడంతో తన రాజకీయ ఆదేశం సక్రమంగా అమలు జరిగేట్టు చూసే అవకాశం లెనిన్‌కు చిక్కలేదు. తర్వాత ఆరు వారాలకు ప్రారంభమైన 12వ మహాసభకు వుద్దేశించిన లెనిన్ పత్రం దానికి తెలియకుండానే పోయింది. లెనిన్ మరణానంతరం 1924 లో 13వ పార్టీ మహాసభ జ[illegible] యీమహాసభకు ముందు పార్టీ అంతరంగిక చర్చ జరిగింది. యీ అంతరంగిక చర్చ ఫలితంగా కేంద్ర కమిటీ నాయకత్వపు బలాబలాల పొందికలో మార్పు వచ్చింది. పార్టీ ప్రధాన నాయకుల స్వభావాలను వివరిస్తూ లెనిన్ రాసిన నోట్స్‌ను మహాసభకు ముందు జరిగిన కేంద్ర కమిటీ ప్లీనరీ సమావేశానికి లెనిన్ సతీమణి క్రూపస్కయా అందజేశారు. యీ నోట్స్‌ను మహాసభ ప్లీనరీ సమావేశంలో గాక మహాసభ ప్రతినిధివర్గాలకు మాత్రమే తెలియజేయాలని పొలిట్‌బ్యూరో తరపున కామెనేవ్ ప్రతిపాదించాడు. యీ లేఖను చర్చిస్తూండినపుడు స్టాలిన్‌నే ప్రధాన కార్యదర్శి పదవిలో వుంచే అవకాశాన్ని ప్రాతిపదికగా చేసుకోవాలని సిఫారసు చేశాడు. యీ పత్రాన్ని జినొవియేవ్ చదివాడు, కామెనేవ్ సంబంధిత వ్యాఖ్యానాలు చేశాడు.

# లెనిన్, సోషలిస్టు ప్రజాస్వామ్యం

ఆ ఘటనలపై, "మహాసభకు లేఖ"ను ప్రచురించరాదని కేంద్ర కమిటీ బలపర్చిన పొలిట్ బ్యూరో నిర్ణయంపై మరింత వెలుగు ప్రసరింపజేయడానికి అనాస్తాస్ మికొయాన్ స్మృతులు సహాయకారిగా వుండగలవు. స్టాలిన్ చనిపోయే వరకూ తమతమస్థానాల్లో వుండిన కొద్దిమంది కేంద్ర కమిటీ సభ్యుల్లో యీయన ఒకరు. "పొలిట్ బ్యూరో ప్రతిపాదన దాని అంతర్గత వైరుధ్యాలను ప్రతిబింబించిందని నా అభిప్రాయం. ట్రాట్స్కీ పాత్ర పెరుగుతోందని ముఖ్యంగా జినోవియేవ్, కామెనేవ్, బుఖారిన్, రైకోవ్, తదితరులకు గల భయమే అందులో ప్రతిబింబించింది. లెనిన్ ఆదేశం అమలు నుండి వైదొలగే ధోరణి కూడా ఆ ప్రతిపాదనలో వుంది.

"లెనిన్ హెచ్చరించి నప్పటికీ కూడా పొలిట్ బ్యూరో సభ్యులు కొందరు స్టాలిన్‌ను గట్టి ప్రత్యర్థిగా పరిగణించలేదు. మరి కొందరు ఆయనబోనాపార్టిస్టు నాయకుని పాత్ర నిర్వహించడానికి ఉబలాటపడుతాడని అనుకోలేదు. పార్టీలో సైద్ధాంతిక, భావజాల వేత్తగా బాగా గుర్తింపు పొందిన, గొప్ప ప్రతిష్టగల మరోనాయకుణ్ణి యెన్నుకోడానికి బదులు స్టాలిన్‌ను ఆ పదవిలో అలా వుంచడమే మంచిదని వారనుకున్నారు. ప్రతిష్టగల నాయకుడు స్టాలిన్ కన్నా యెక్కువగా తన అభిప్రాయాన్ని రుద్దుతాడనీ, ఆ విధంగా సమిష్టి నాయకత్వాన్ని నీరుగారుస్తాడనీ వారు భయపడ్డారు. యిది యీనాడు విచిత్రంగానే కాక నమ్మశక్యంలేనిదిగా కనిపించవచ్చు. కాని పరిస్థితి అలా వుండిందని నా అభిప్రాయం." అని అన్నారు.

అనేక జటిలమైన మానసిక సమస్యలకు చారిత్రక అధ్యయనాలు సమాధానమివ్వాల్సి వుంది. యింతటి ప్రాణాంతకమైన పొరపాట్లు లెనిన్ సన్నిహితులు చేయడానికి, వివిధ సమయాల్లో వారు స్టాలిన్‌తో మమేకం కావడానికీ, రెచ్చగొట్టే చర్యల్లో వస్తుగతంగా ఆయనకు తోడ్పడడానికీ, ముఖ్యంగా యితర పొలిట్‌బ్యూరో సభ్యులను అప్రతిష్టపాల్జేసి వారిని పార్టీ, దేశ సారథ్యం నుండి దూరంగా వుంచేందుకు వారి గత పొరపాట్లను తవ్వి తీయడంలో స్టాలిన్‌కు తోడ్పడడానికి కారణాలేమిటి? లోపభూయిష్టమైన రాజకీయ నీతా లేక మితిమీరిన నమ్మకమా, స్టాలిన్ ధూర్త రాజకీయాలు యెంత దూరం వెళ్తాయో చూడలేని అశక్తతా. స్టాలిన్‌చేతి లోని మరో తీవ్రమైన సైద్ధాంతిక ఆయుధం "ముఠా తత్వం" అని ఝుళిపించే కొరడా. రాజకీయాల్లో కేంద్రకమిటీ మెజారిటీతో చేసిన యేదో ఒక మార్పును పార్టీలోని అసమ్మతి బృందాలేవైనా వ్యతిరేకిస్తే వాటికి ఆయన "ముఠాతత్వం" అనే ముద్ర వేసేవాడు.

ఈ విధంగా స్టాలిన్ పొలిట్ బ్యూరోలోని ఏడుగురు సభ్యుల్లో ఆర్గురిని పొలిట్ బ్యూరో నుండి (కొందరిని కేంద్ర కమిటీనుండి తుదకుపార్టీ నుండి కూడా) 1930 నాటికల్లా తొలిగించి వేశాడు. అంటే పాత సభ్యుల్లో తానొక్కడే పొలిట్ బ్యూరోలో వున్నాడు. కొన్నేళ్ల తర్వాత వాళ్లను "ప్రజల శత్రువులు"గా చిత్రించి భౌతికంగా నాశనం చేశాడు.

లెనిన్ సిఫారసులను 13వ పార్టీ మహాసభ తిరస్కరించడం పార్టీకి ప్రాణాంతకంగా పరిణమించింది. స్టాలిన్‌ను గట్టిగా వ్యతిరేకించిన కమ్యూనిస్టులు లెనిన్ రాజకీయ ఆదేశాన్ని పార్టీకి తెలియజేసే మార్గాల కోసం అన్వేషించసాగారు. స్టాలిన్ తన చేతుల్లో నానాటికీ రాజకీయ అధికారాన్ని కేంద్రీకరించుకోవడం వారు గమనించారు; లెనిన్ పేర్కొన్న అనేక వ్యతిరేక లక్షణాలు స్టాలిన్‌రాజకీయ ప్రవర్తనలో వ్యక్తం కావడం వారు చూశారు. ఏదేమైనప్పటికీ 1956 వరకూ "మహాసభకు లేఖ" అనేపత్రం ఒకే ఒక ప్రచురణకు నోచుకున్నది—అది కూడా 15వ పార్టీ మహాసభ (1927) ప్రతిని

# లెనిన్, సోషలిస్టు ప్రజాస్వామ్యం

ధులకు ప్రత్యేకంగా వుద్దే శించిన రహస్య బులెటిన్‌గా( ఆ లేఖ పాఠాన్ని ప్రజలు రహస్యంగా తమ వద్ద వుంచుకుని పంపిణీ చేసినందుకు అరెస్టులు జరుగుతున్న సందర్భంలో) విడుదలైంది.

1920ల నాటి పార్టీ ఆంతరంగిక చర్చల పత్రాలను నిష్పక్షపాతంగా పరిశీలిస్తే స్టాలిన్ అక్రమంగా యెలా అధికారాన్ని చేజిక్కించుకున్నాడో తెలుస్తుంది. నాటకీయంగా జరిగిన ఆపోరాటఘటన లన్నిటినీ వెలుగులోకి తెచ్చామని చెప్పలేము. అందుకోసం సంబంధిత పత్రాలన్నిటినీ క్షుణ్ణంగా అధ్యయనం చేయాలి. ఇప్పుడు నూతన ఆర్థిక విధానం (నెప్), సమిష్టీకరణపై తీవ్ర చర్చజరుగుతోంది. ఆ అంశాలను మాత్రం పరిశీలిద్దాం.

## స్టాలిన్‌రాజకీయ స్వభావంలో మార్పు

పదవపార్టీ మహాసభ 1921 లో యెలాంటి చర్చలేకుండా, యేకగ్రీవంగా ఆమోదించిన నూతన ఆర్థికవిధానం (నెప్) ఒకరాజకీయ చర్య, సోవియట్ రష్యా ఆంతరంగిక రాజకీయ సంక్షోభం దృష్ట్యా "రైతు (పెటీబూర్జువా) విప్లవప్రతీఘాత" ప్రమాదం దృష్ట్యా తీసుకున్న చర్యగా దీన్ని లెనిన్ పరిగణించారు.

నెప్ లోని నూతన అంశాలను లెనిన్ మాటల్లో చెప్పాలంటే "టర్నోవర్ స్వేచ్ఛ-వ్యాపారస్వేచ్ఛ-పెట్టుబడిదారీ విధానానికి స్వేచ్ఛ": వ్యవసాయంలో పరిశ్రమల్లో పెట్టుబడిదారీ విధానానికి స్వేచ్ఛను (రాజకీయాధికారాన్ని ఆర్థికవ్యవస్థపై తిరుగులేని పట్టును సోషలిజం తన చేతిలోనే వుంచుకుంది) నూతన పురోగమనానికి "పరాజయంగా, వెనుకంజగా" లెనిన్ పరిగణించారు." "మనం ఎత్తుగడతో కూడిన వెనుకంజ వేస్తున్నాం, సమీప భవిష్యత్తులో ముందుకుసాగడానికి యిది మనకు విస్తృత సంఘటనను సమకూరుస్తుంది...." ఈ వెనుకంజకు స్వస్తి చెప్పే సమస్యను 1922 లోనే ఆయన లేవనెత్తి "ప్రయివేటు పెట్టుబడికి వ్యతిరేకంగా దాడికి సన్నాహాలు" అనే కొత్త నినాదాన్ని యిచ్చారు.

నెప్‌లో రెండు అంశాలను లెనిన్ చూశారు. ఆయన ఆలోచనలోని గతితార్కిక భావన వున్నది యిందులోనే. ఆ రెండు అంశాలు : ప్రయివేటు పెట్టుబడితో పోటీ (వ్యాపారం చేసే శక్తి); పెట్టుబడిదారీ అంశాలు పెరుగుతున్న పరిస్థితిలో అనివార్యమైన వర్గపోరాటం.

దేశంలోని సంక్లిష్టమైన సామాజిక-ఆర్థిక పరిస్థితులను పరిష్కరించడానికి నెప్ మొదటి సంవత్సరంలో చేసిన కృషివల్ల నిర్దేశించిన లక్ష్యాలు అన్ని సందర్భాల్లో నెరవేరలేదు. "యిది మనం అనుమతించదగిన, అనుమతించి తీరాల్సిన, కొన్ని హద్దుల్లో దీన్ని మనం వుంచగల, వుంచితీరాల్సిన పెట్టుబడిదారీ విధానం"గాదీన్ని భావించిన లెనిన్ యీ రెండు రకాల కర్తవ్యాల పరిష్కారంలోని వైఫల్యాలనీ పదకొండవ పార్టీ మహాసభలో (1922) ధైర్యంగా పేర్కొన్నారు.

"సరే, మనం ఒక సంవత్సరంపాటు చూశాం, రాజ్యం మన చేతిలోనే వుంది; అయితే గతసంవత్సరం అది నూతన ఆర్థిక విధానాన్ని మనం ఆశించిన పద్ధతిలో అమలు జరిపిందా? లేదు. కాని ఆశించిన పద్ధతిలో అది నడవలేగని అంగీకరించడానికి మనం తిరస్కరిస్తున్నాం. మరి అది ఎలా నడిచింది? తన యజమాని ఆజ్ఞను ఆ యంత్రం తిరస్కరించింది. కారును డ్రయివర్ యే దిశలో నడపడానికి ప్రయత్నించాడో ఆదిశలో అది వెళ్లలేదు. మరెవరో కోరుకున్న దిశలో వెళ్లిపోయింది; ఏదో రహస్యమైన అరాచక హస్తం నడుపుతున్నట్టు అది సాగింది. అది అక్రమ లాభార్జన పరులదో, ప్రయివేట్ పెట్టుబడిదారులదో దేవునికి తెలియాలి చెప్పాలంటే, డ్రయివర్ కోరుకున్న

# లెనిన్, సోషలిస్టు ప్రజాస్వామ్యం

దిశలోకాక పూర్తిగా వ్యతిరేకదిశలో తరచు కారు పోయింది' నెప్ మొదటి సంవత్సరంలో వెలుగులోకి వచ్చిన సామాజిక-ఆర్థిక రాజకీయ వైరుధ్యాలు యిలాంటివి. తదనంతర సంవత్సరాల్లో అవి పెచ్చుపెరుగుతూ పోయాయి. లెనిన్ మరణించిన తర్వాత యీ వైరుధ్యాలు పార్టీలోపల భావజాల, సైద్ధాంతిక, రాజకీయ చర్చల్లో ప్రతిబింబించసాగాయి. దేశ సామాజిక-ఆర్థిక సమస్యలను పరిష్కరించడంలో పార్టీ నాయకుల్లోని అత్యంత మితవాద వైఖరులను 1928 వరకూ స్టాలిన్ కలిగివున్నాడు. పారిశ్రామికీకరణ కోసం సంచయన వనరులగురించీ, నానాటికీ రైతాంగంలో పెరుగుతున్న తారతమ్యాన్ని గురించీ 1928 వరకూ తన అభిప్రాయాన్ని ప్రకటించకుండా తప్పించుకున్నాడు. 1927 డిసెంబరులో జరిగిన 15వ పార్టీ మహాసభకు సమర్పించిన రాజకీయ నివేదికలో కూడా గ్రామసీమలో పార్టీ ప్రాథమిక కర్తవ్యాల గురించి అత్యంత సాధారణీకృత, అమూర్తచిత్రణ యిచ్చాడు; "ప్రధానమైన రైతు జనావళి; ముఖ్యంగా గ్రామీణ పేదల పాదార్థిక, సాంస్కృతిక హెూదాను మరింత మెరుగుపర్చే పంథాను కొనసాగించండి; కార్మికవర్గ, రైతాంగ బాంధవ్యాన్ని పటిష్టీకరించండి; గ్రామసీమలో కార్మికవర్గ ప్రతిష్టను పెంచండి."

కులక్కులను నిరాస్తిపరులుగా చేయాలని 1920లలో పార్టీలోని ప్రతిపక్షబృందాలు చెప్పక పోవడం గమనార్హం. అంటే కులక్కులకు, కులక్కులుగా పరిగణించబడినవారికి ఆస్తి, తదితర అన్ని హక్కులు లేకుండా చేసి, కుటుంబాలతో సహా వారిని మారుమూల బడుగుప్రాంతాలకు పంపడం. యిది తర్వాతి సంవత్సరాల్లో జరిగింది. రైతుల్లో తారతమ్యాలు పెరిగే ప్రమాదమున్నదనీ, ఆర్థిక పద్ధతుల ద్వారా కులక్కులపై మరింత తీవ్ర వత్తిడి చేయాలనీ స్టాలిన్ ప్రత్యర్థులు సూచించారు: పారిశ్రామిక సరకులకూ, ఆహార పదార్థాలకూ మరింత నమ్యమైన ధరల విధానం; రైతాంగంలోని వివిధ విభాగాలపై మరింత భేదాత్మక పన్ను వగైరా. కాని స్టాలిన్ ఆమాత్రపు ప్రతిపాదనలకు కూడా అభ్యంతరం చెప్పాడు. వాటిని రైతాంగాన్ని దోపిడీ చేసేవిగా, గ్రామ సీమలలో అంతర్యుద్ధంగా పరిగణించారు.

1927 చివరి వరకూ స్టాలిన్ యిదే అభిప్రాయాన్ని కలిగివున్నాడు. రైతుల పొలాలన్నీ నూతన సాంకేతిక ప్రాతిపదికపై యాంత్రీకరించి, విద్యుదీకరించిన తర్వాత సర్వావృత సమిష్టీకరణ జరుగుతుంది...యీ దిశగా మేము పయనిస్తున్నాం, అయితే యీ దశకు మేము యింకా చేరుకోలేదు, యిది ఎంతోదూరంలో వుంది." అని అప్పుడు విదేశీ కార్మిక ప్రతినిధి వర్గాలతో అన్నాడు.

అలాంటి రాజకీయ, భావజాల ధోరణులు సంపన్న రైతుల ప్రవర్తనపై ప్రగాఢమైన ప్రభావాన్ని నెరపుతాయనడంలో సందేహంలేదు. "విద్యావంతులైన విడివిడి యజమానులపై", "బలమైన సాధ్యతరగతి రైతులపై" తాను ఆశలు పెట్టుకున్నట్టు ప్రభుత్వం ప్రకటించిన ఫలితంగా చిన్నస్థాయి సరకుల సద్యోజనిత ఉత్పత్తి నిరంతరంగా పాదుకుంటూ, గ్రామసీమలో రోజురోజుకూ పెట్టుబడిదారీ విధానాన్ని పునరుద్ధరించసాగింది. తన లాభాల్లో కోతపెట్టే ప్రభుత్వ ప్రయత్నాలన్నిటి పట్ల శక్తివంతులైన కులక్కులు మరింత మెలకువతో వ్యవహరించసాగారు.

వారి నిరసన 1927 చివర్లో వ్యక్తమైంది. యీ సంపన్న రైతులు నిర్ణీత ధరకు ప్రభుత్వానికి ధాన్యం విక్రయించడానికి నిరాకరించారు. యీ ధోరణి దేశమంతటా పాకింది. ధాన్యం కొనుగోలులో ప్రభుత్వానికి యిబ్బందులు యెదురయ్యాయి. ఫలితంగా దేశ ఆర్థిక పరిస్థితి మరింత చిక్కులో పడిపోయి సామాజిక ఘర్షణలు తీవ్రతరమయ్యాయి.

# లెనిన్, సోషలిస్టు ప్రజాస్వామ్యం

ఈ నూతన సామాజిక-ఆర్థిక సమస్యల పట్ల బాగా ఆలోచించి సరియైన వైఖరిని తీసుకోవాల్సిన అవసరం యేర్పడింది. స్టాలిన్ బృందం అప్పటికే రాజకీయ నాయకత్వంలో మెజారిటీ సాధించింది. కాని యీ ఘటనవల్ల రాజనీతిజ్ఞతను ప్రదర్శించలేకపోయింది. సోషలిస్టు నిర్మాణంలో కార్మికవర్గ బంధువు రైతాంగమనే లెనిన్ సూత్రానికి వారు తిలోద కాలిచ్చారు. రైతాంగానికి వ్యతిరేకంగా పెద్ద యెత్తున హింసాయుత చర్యకు తలపడ్డారు.

1928 జనవరి 15 నాటికే స్టాలిన్ సైబీరియాకు వెళ్లి అక్కడ అత్యవసర చర్యల అమలు ద్వారా "ధాన్యం కొనుగోలు పథకాన్ని నెరవేర్చే స్టాలిన్ పద్ధతి" ని కనుగొన్నాడు. దేశంలోని అన్ని మండలాలు యెలాంటి మినహాయింపులు లేకుండా" సమిష్టి వ్యవసాయక్షేత్రాల పరిధిలోకి ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల పరిధిలోక్కి రావాలి. అవి కులక్కులనే కాక విడివిడి రైతులను కూడా తొలగించి ప్రభుత్వానికి ధాన్యం సరఫరాదార్లుగా మారిపోవాలి" అని ఆయన డిమాండ్ చేశాడు.

గ్రామాల్లో లోగడ అనుసరించిన విధానంనుండి స్టాలిన్ పూర్తిగా వైదొలగాడు. అకస్మాత్తుగా, వూహించనిరీతిలో, తికమక పెట్టేవిధంగా జరిగిన యీ మార్పు పార్టీలోని అభిప్రాయభేదాలను తెలియజేస్తున్నాయి. యీ విభేదాలను మొత్తం పార్టీలో చర్చ కోసం సమర్పించలేదు. పార్టీ పొలిట్ బ్యూరోలోని త్రిసభ్య బృందం (బుఖారిన్, రైకోవ్, తోమ్‌స్కీ) సమర్పించిన పత్రం యీ అత్యవసర చర్యల విధానాన్ని వ్యతిరేకించింది. దీన్ని పార్టీ క్రియాశీల కార్యకర్తలనుండి కూడా రహస్యంగా వుంచారు పార్టీలో మితవాద పెడ మార్గాలను 1928 నాటికే స్టాలిన్ "కనుగొన్నాడు" పెడమార్గం పట్టిన యీ మితవాద బృందానికి 1929 ప్రారంభంనాటికే తన అభిప్రాయాన్ని వ్యక్తంచేసే అవకాశం లేకుండా చేశాడు స్టాలిన్. కొన్ని నెలల తర్వాత, అంటే "నూరుశాతం సమిష్టీకరణ ప్రాతిపదికపై ఒక వర్గంగా కులక్కులను నిర్మూలించే విధానాన్ని" అమలు పెట్టడానికి ముందే తనకు ప్రీతి పాత్రమైన ముఠాతత్వా కొరడాను ఝుళిపించి, త్రిసభ్య బృందం అభిప్రాయాలు తప్పని దాని సభ్యులు అంగీకరించేట్టు వత్తిడి చేశాడు. బుఖారిన్‌ను పొలిట్‌బ్యూరోనుండి తొలగించాలని కూడా ఆయన పట్టుపట్టాడు.

1930 లో జరిగిన 16వ పార్టీ మహాసభలో యీ "మితవాద పెడ మార్గీయుల"ను నిర్మూలించే పని పూర్తి అయింది. అత్యవసర చర్యలపై "మితవాద ప్రతిపక్ష నాయకుల అపస్మారక స్థితి"ని వారి అభిప్రాయాలను ఆయన గేలి చేశాడు.

సోషలిస్టు నిర్మాణంలోని వక్రీకరణలను మనం అంచనా వేసేటప్పుడు 1928కి ముందూ, తర్వాతా గ్రామాల్లో పార్టీవిధాన సూత్రాలనూ,పద్ధతులనూ ప్రాతిపదికగా చేసుకుని ముందుకు సాగాలి. చారిత్రక పరిణామాలకు ప్రత్యామ్నాయంగా మొదటినుండే సహకారోద్యమాన్నిదాని దిగువ స్థాయినుండి అత్యంత అభివృద్ధి చెందిన రూపాలవరకూ ఐచ్ఛిక ప్రాతిపదికపై పెంపొందించాలి; అంటే పన్ను విధానం ద్వారా, యితర ప్రబలమైన ఆర్థిక చర్యలతో సోషలిస్టు రాజ్యం ప్రయివేటు పెట్టుబడిదారీ రంగాన్ని అదుపులో వుంచుతూ దానితో పోటీపడడం ద్వారా పెంపొందించాలి. లెనిన్ మరణం తర్వాత ఒకవైపు కులక్కు క్షేత్రాలకు పోగుచేసుకునే స్వేచ్ఛయిచ్చి, అలా సంపన్నులైన వారిపై తర్వాత అణచివేత చర్యలు తీసుకున్న మధ్య కాలంలో రైతుల మధ్య సామాజిక అంతరం బాగా పెరిగింది. యీ అంతరం యింతటి విస్తృతంగా పెరగకుండా వుండినట్టయితే

(మిగతా 25వ పేజీలో)

# సోవియట్ యూనియన్‌లో జనాభా గణాంక విశ్లేషణ

ఎం. తోల్త్స్
క్యాండిడేట్ ఆఫ్ ఎకనామిక్స్

మొత్తం మీద సోవియట్ జనాభాలో వృద్ధుల శాతం పెరుగుతోంది. 1951 లో ఫించనుదార్ల శాతం జనాభాలో 10.2 వుండగా 1987 లో 16.8 శాతానికి పెరిగింది.

జననాలరేటు తగ్గుదల వల్ల యిది జరిగింది. 1951లో 16 యేళ్ల లోపు వారి శాతం జనాభాలో 32.2 వుండగా 1961 లో 26.3 శాతానికి తగ్గింది.

ఉక్రేయిన్, బైలో రష్యాల గ్రామీణ ప్రాంతాల్లో జననాల రేటు కన్నా మరణాలరేటు యెక్కువ, కాగా లాత్వియా, లిథుయేనియా, ఎస్తోని యాల గ్రామీణ ప్రాంతాల్లో మరణాలరేటు కన్నా జననాల రేటు యెక్కువ. దేశంలోని 35-39 వయో బృందంలోని వివాహిత మహిళల్లో 3.5 శాతానికి మాత్రమే సంతానం లేదు.

పురుషుల సగటు ఆయు ర్దాయం 65 యేళ్లు. 1960ల మధ్యకాలంలో వుండినదానికన్నా యిది యేడాది తక్కువ. మహిళల సగటు ఆయుర్దాయం 73.8యేళ్ళు అంటే, ఇది 20 యేళ్ల క్రితం నాటి స్థాయికి తిరిగి చేరుకుంది. యీ విషయంలో సోవియట్ యూనియన్ అనేక దేశాల కన్నా వెనుకబడి వుంది.

## వివాహాలు

30 యేళ్లలోపు గల జనాభాలో స్త్రీలకన్నా పురుష లు ఎక్కువ సంఖ్యలో వున్నారు. కాని నగరాల్లో 15 యేళ్ల పైబడిన జనాభాలో పురుష లకన్నా స్త్రీలే యెక్కువ సంఖ్యలో వున్నారు. గ్రామ సీమల్లో 40 యేళ్లలోపు స్త్రీల కన్నా పురుషులే యెక్కువ మంది వున్నారు. నగరాల్లో జీవన, పని పరిస్థితులు అనుకూలంగా వున్నందున స్త్రీలు అక్కడికి తరలివెళ్లు తున్నట్టు యిది తెలియ చేస్తోంది. అందువల్ల, వివాహ వయస్కులైన స్త్రీల కొరత గ్రామీణ ప్రాంతాల్లో స్పష్టంగా కనిపిస్తోంది.

మొత్తంమీద వివాహాలు, మామూలుగా జరిగి పోతు న్నాయి. 50 లోపు వయస్సు గల వారిలో 2.6 శాతం పురు షులు, 3.5 శాతం స్త్రీలు మాత్రమే అవివాహితులుగా వుంటున్నారు.

50 యేళ్ల తర్వాత పెళ్లిచే సుకునే జార్జియా పౌరుల్లో స్త్రీల శాతం యెక్కువ (6.7 శాతం). బాల్టిక్ రిపబ్లిక్కు లలో యిది. 4.8 నుండి 5:8 శాతం వరకు వుంటుంది. పెళ్లి చేసుకోకుండా వుండి పోతున్న స్త్రీ పురుషుల సంఖ్య తజికిస్తాన్‌లో అతి తక్కువ 0.8 శాతం). దేశం మొత్తంమీద గల అవివా హితుల సగటుశాతం రష్యన్

వమాఖ్యలో అవివాహితులైన మహిళల శాతం ఒకే విధంగా వుంది. కాని పురుషుల్లో యీ శాతం కొద్దిగా యెక్కువ వుంది. (2.9 శాతం).

20 యేళ్లలోగా పెళ్లి అయిన స్త్రీలు తుర్క్‌మేనియాలో చాలా తక్కువమంది వున్నారు (21.6 శాతం). వీరు అజర్ బైజాన్‌లో 22.5 శాతం, లిథుయేనియాలో 24.9 శాతం, ఎస్తోనియాలో 27.5 శాతం, లాత్వియాలో 29.5 శాతం, రష్యన్ సమాఖ్యలో 33.1 శాతం, ఉక్రేయిన్‌లో 38.4 శాతం, తజికిస్తాన్‌లో 49.1 శాతం వున్నారు.

ఎస్తోనియాలో తప్ప 1970 లలో కన్నా 1980 లలో అన్ని రిపబ్లిక్కులలో విడాకులు తగ్గిపోయాయి. అదే సమయంలో తిరిగి పెళ్లిచేసుకున్న వారిసంఖ్య పెరిగింది. తిరిగి పెళ్లి చేసుకున్న పురుషుల సంఖ్య 1980లో 378,000 వుండగా 1986లో 530,000కు పెరిగింది; స్త్రీల సంఖ్య 329,000 నుండి 493,000కు పెరిగింది. దీనర్థం విడాకులంటే పెళ్లి చేసుకోకుండా వుండిపోవాలని కాదు.





| | 16 యేళ్లలోపు పిల్లలు | పనిచేసే శక్తిగల జనాభా ★ | పింఛనుదార్లు ★★ |
|---|---|---|---|
| సోవియట్‌యూనియన్ | 27.0 | 56.2 | 16.8 |
| రష్యన్ ఫెడరేషన్ | 23.9 | 57.8 | 18.3 |
| ఉక్రేయిన్ | 23.4 | 56.1 | 20.5 |
| బైలొరష్యా | 25.0 | 57.0 | 18.0 |
| ఉజ్బెకిస్తాన్ | 42.9 | 49.1 | 8.0 |
| కజకస్తాన్ | 33.3 | 54.9 | 11.8 |
| జార్జియా | 26.6 | 56.4 | 17.0 |
| అజర్బైజాన్ | 34.5 | 56.0 | 9.5 |
| లిథుయేనియా | 24.5 | 57.0 | 18.5 |
| మొల్దావియా | 30.1 | 55.6 | 14.3 |
| లాత్వియా | 22.7 | 57.1 | 20.2 |
| కిర్ఘిజియా | 39.6 | 50.5 | 9.9 |

| | | | |
|---|---|---|---|
| తజికిస్తాన్ | 44.7 | 47.3 | 8.0 |
| ఆర్మీనియా | 31.5 | 57.1 | 11.4 |
| తుర్క్‌మేనియా | 42.7 | 49.6 | 7.7 |
| ఎస్తోనియా | 23.3 | 57.0 | 19.7 |



గ్రామీణ జనాభా

| | 16 యేళ్లలోపు పిల్లలు | పనిచేసే శక్తిగల జనాభా ★ | పింఛనుదార్లు ★★ |
|---|---|---|---|
| సోవియట్ యూనియన్ | 31.1 | 49.3 | 19.6 |
| రష్యన్ ఫెడరేషన్ | 26.2 | 50.6 | 23.2 |
| ఉక్రేయిన్ | 23.2 | 49.1 | 27.7 |
| బైలోరష్యా | 22.5 | 48.8 | 28.7 |
| ఉజ్బెకిస్తాన్ | 48.3 | 44.7 | 7.0 |
| కజకస్తాన్ | 38.1 | 49.5 | 12.4 |
| జార్జియా | 27.5 | 53.7 | 18.8 |
| అజర్బైజాన్ | 37.8 | 53.2 | 9.0 |
| లిథుయేనియా | 24.2 | 49.4 | 26.4 |
| మోల్దావియా | 32.7 | 50.5 | 16.8 |
| లాత్వియా | 24.4 | 52.5 | 23.1 |
| కిర్ఘిజియా | 44.5 | 46.3 | 9.2 |
| తజికిస్తాన్ | 48.4 | 44.3 | 7.3 |
| ఆర్మీనియా | 34.1 | 53.2 | 12.7 |
| తుర్క్‌మేనియా | 47.1 | 45.8 | 7.1 |
| ఎస్తోనియా | 23.7 | 52.8 | 23.5 |

★ పురుషులకు 16 నుండి 59, స్త్రీలకు 16 నుండి 54 సంవత్సరాల వరకు పనిచేసే శక్తి వుంటుంది.
★★ పురుషులకు 60 యేళ్లు, స్త్రీలకు 55 యేళ్లు ఉద్యోగ విరమణ వయస్సు

# లెనినూ, సోషలిస్టు ప్రజాస్వామ్యం

(21వ పేజీ తరువాయి)

చారిత్రకంగా అనివార్యమైన సమిష్టీకరణ చాలావరకు సాఫీగా, అపారమైన ప్రాణ, పాదార్థిక నష్టం లేకుండా జరిగిపోయేది,

**వక్రీకరణలు లేకుండా చేయడానికి హామీలు**

సోషలిజపు ఆర్థిక పునాదిని సర్వతోముఖంగా ప్రజాస్వామ్యీకరించే, పటిష్టీకరించే విధానాన్ని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ ఆమోదించింది. కాబట్టి సోవియట్ సమాజంలో నైతిక వాతావరణాన్ని మెరుగు పర్చడం కూడా అవసరం.

ఒకేఒక పాలక పార్టీ వున్నందువల్ల వుత్పన్నం కాగల ప్రమాదాన్ని గురించి లెనిన్ పదేపదే హెచ్చరిస్తూ భావజాల పరమైన ఆసక్తిగల వారికే పార్టీ సభ్యత్వమివ్వాలనీ, వ్యక్తిగత ప్రయోజనాలను, ప్రత్యేక హక్కులను, మంచి వుద్యోగాన్ని పొందడానికి ప్రయత్నించే వారికి పార్టీ సభ్యత్వమివ్వకూడదనీ అన్నారు. దగాకోర్లను, స్వప్రయోజనపరులను, పరోపజీవులను పార్టీలో లేకుండా కడిగివేయడానికి అవిశ్రాంతంగా పాటుపడాలన్నారు. లెనిన్ వున్నప్పుడూ, ఆయన మరణానంతర తొలి సంవత్సరాల్లో గల సామాజిక హామీల (పార్టీ ప్రవర్తనా నియమాలు, వగైరా) ఆచరణను క్షుణ్ణంగా అధ్యయనం చేయడం అవసరం. భావజాలపరంగా నిఖార్సయిన వారిని, చిత్తశుద్ధిగలవారిని, నిస్వార్థపరులను పార్టీ సభ్యత్వానికి ఎన్నుకోడానికి యీ అధ్యయనం అవసరం.

పార్టీని, సమాజాన్ని సర్వతోముఖంగా ప్రజాస్వామ్యీకరించే విధానంకోసం అత్యంత ముఖ్యమైన సైద్ధాంతిక, ఆచరణ సంబంధ సమస్యలను విశ్లేషించాలి. యీ పనిని సోవియట్ విజ్ఞాన శాస్త్రం యింతవరకూ తగినంతగా విశదీకరించలేదు : ఒకేఒక పాలకపార్టీ వున్నపుడు ప్రజా జీవితానికి సంబంధించిన అన్నిరంగాలను ఎలా ప్రజాస్వామ్యీకరించాలి; వలురకాల సామాజిక ప్రయోజనాలను (సామాజిక ప్రగతికి అనుకూలమైన ప్రయోజనాలను నిర్దేశించడం, అన్యమైన స్వార్థపర ప్రయోజనాలను వ్యతిరేకించడం) యెలా ప్రతిబింబించాలి?

సామాజిక ప్రయోజనాలను బహిర్గతం చేసి, సమన్వయపర్చడానికి గంభీరమైన రాజకీయ నిర్ణయాలను రూపొందించాలి.

స్టాలిన్ చేతుల్లో మితిమీరిన అధికార కేంద్రీకరణవల్ల, ప్రధాన రాజకీయ నిర్ణయాల రూపకల్పనలో ప్రజల భాగస్వామ్యం లేకుండా చేసినందువల్ల సోషలిజానికి వక్రీకరణలు జరిగినట్టు సోవియట్ యూనియన్‌లోని సోషలిస్టు నిర్మాణ చరిత్ర తెలియజేస్తోంది. నిర్ణయాలు చేయడంలో ప్రజల భాగస్వామ్యానికి సంబంధించిన యంత్రాంగాన్ని యిటీవల సంవత్సరాల్లో పునరుద్ధరించడం మొదలు పెట్టారు. యీ యంత్రాంగ మౌలిక సూత్రాలను పార్టీ 19వ సమావేశం నిర్దేశించింది. పాత వక్రీ కరణలు పునరావృతం కాకుండా, కొత్తవి తలెత్తకుండా యీ యంత్రాంగం మాత్రమే విశ్వసనీయమైన హామీగా వుండగలదు.

సోవియట్ యూనియన్ గతచరిత్రపై, అందులోని ఖాళీల పూరింపుపై, పార్టీ చరిత్రలో మరుగున పడిపోయిన వారిపై ఇటీవల యెంతో ఆసక్తి పెరగడానికి నేను పైన పేర్కొన్న విషయాలు కారణమని స్పష్టమౌతోంది. తప్పులు, తడకలతో స్టాలిన్ నింపివేసిన చరిత్రను సరిచేయడం ద్వారా అందులోని తీవ్ర విషాద ఘటనలను ప్రగాఢంగా విశ్లేషించడంద్వారా మనం గతంనుండి గుణపాఠాలు నేర్చుకో విలుంటుంది; సోషలిజానికి జరిగిన వక్రీకరణలు, యిప్పటికీ అనుభూతమౌతున్న యీ వక్రీకరణలు యెన్నటికీ పునరావృతం కాకుండా వుంటాయి.

# సోవియట్ ఆర్థిక వ్యవస్థ: అవరోధాలు

సోవియట్ యూనియన్‌లో ఇటీవల నెలకొల్పిన మేనేజర్ సర్వీస్ అన్న సంస్థలో, సోవియట్ జ్ఞానియె సొసైటీ, సోవియట్-అమెరికా సంస్థ డయలాగ్, డెన్మార్క్ సంస్థ ప్రైమ్ మేనేజర్ ఇంటర్నేషనల్ (టి.ఎం.ఐ.) పాల్గొంటున్నాయి. ప్రధానంగా ఈ నూతన సంస్థ, టి.ఎమ్.ఐ నిపుణుల సహాయంతో సోవియట్ పౌరులకు శాస్త్రీయ మేనేజిమెంటు పద్ధతులను ఉపయోగించుకోవడంలో శిక్షణ నిస్తుంది.

టి.ఎం.ఐ సంస్థ అధ్యక్షుడూ, పారిశ్రామిక మేనేజిమెంటులో నిపుణుడు అయిన కె. మొయిల్లర్‌ను విలేకరి ఎం. ద్మిత్రియేవ్ ఇంటర్వ్యూ చేశాడు.

ప్ర: సోవియట్‌యూనియన్‌లో మీరు అనేకమంది సీనియర్ అధికార్లను కలుసుకున్నారు. వారిని గురించి మీ అభిప్రాయ మేమిటి?

జ: సీనియర్ మేనేజిమెంటు పదవుల్లో ఉన్నవారిలో చాలామందికి తాము చేస్తున్న పనిపట్ల బహు అస్పష్టమైన అవగాహన ఉంది. అదే సమయంలో, వారి చుట్టూగల వారిలో కొందరికి తమ వృత్తిలో మంచి పరిజ్ఞానం ఉంది.

ప్ర: సోవియట్ ఆర్థికవ్యవస్థ అభివృద్ధికి ఉన్న యితర అవరోధాలేమిటి?

జ: మీ ప్రణాళిక రచనాపద్ధతి సరియైనది కాదని భావిస్తున్నాను. మీరు ఐదేళ్ళకాలానికి ప్రణాళికలు వేస్తారు. యిది ఆధారపడవీలు లేనంత దీర్ఘకాలం. ఎందుకంటే, ప్రణాళికలు రూపొందించే టప్పుడు ప్రణాళికావేత్తల అంచనాలు ఐదేళ్ళకాలం ముగియ డానికి చాలా ముందుగానే నిరుపయోగకర మైనవి అయిపోతాయి. సాంకేతిక శాస్త్రంలో నేటి తుది మాట ఐదేళ్ళ తర్వాత చాలా పాతబడిపోతుంది.

ప్ర: యీ దేశంలో ఆర్థిక సంస్కరణ ఎప్పుడు ఫలితమిస్తుందనుకుంటున్నారు?

జ: ఏ సంస్కరణకైనా సమస్యలే తొలిఫలితాలు అవుతాయి. కష్టాలనుండి తప్పుకోవాలంటే చేయాల్సింది పాతపనిపద్ధతులకు అంటిపెట్టుకోవడమే. నాకు తెలిసినంత వరకూ సంస్కరణలపై మీదేశంలో తీవ్ర అసంతృప్తి ఉంది; పెరిస్త్రోయికా ముందుకంటే యిప్పుడు

పరిస్థితులు మరీ దిగజారిపోయాయని కొందరు చెబుతున్నారు.

ఆర్థిక సంస్కరణకు నిబద్ధులు కావడానికి ముందు, ఈ సంస్కరణ ఫలితం ఎలా ఉంటుందో వేచి చూద్దాం అని అధిక సంఖ్యాకులు ప్రేక్షకులుగా ఉండిపోతున్నారు. అందువల్ల సోవియట్ యూనియన్‌లోని సంస్కరణక్రమంలో వారు క్రియాశీలంగా పాల్గొనడం లేదు. అంతే కాదు ఎప్పుడూ ప్రజల దృష్టినాకర్షిస్తూండే సంస్థల్లో కొట్టవచ్చినట్లు మార్పురావడం ముఖ్యమనీ, వాటివల్ల సామాన్య మానవునికి పెరిస్త్రోయికాపై నమ్మకం యేర్పడటం సులభమవుతుందనీ అనుకుంటున్నాను. ఇలాంటి సంస్థల్లో ఏరోఫ్లోత్ ప్రత్యేకించి ముఖ్యమైనదని అనుకొంటున్నాను. యిందువల్ల, సోవియట్ యూనియన్‌తో వ్యాపారం చేయాలనుకుంటున్న పాశ్చాత్యులకు పెరిస్త్రోయికా వాస్తవమైనదన్న విషయం బోధ పడుతుంది. వారికి- సోవియట్ యూనియన్‌తో పరిచయం ఏరోఫ్లోత్. ఇన్‌టూరిస్ట్ సంస్థలతో ప్రారంభమవుతుంది. నేను 1985 నుండీ ఈ సంస్థల ఖాతాదారుగా ఉన్నాను. నాకిప్పటివరకూ మంచిమార్పు ఏదీ కనిపించ లేదు.

ప్ర: యీ సంస్కరణ క్రమాన్ని పూర్తి చేసేందుకు సోవియట్ యూనియన్‌కు ఎంత కాలం పడుతుందనుకుంటున్నారు?

చాలాకాలం పడుతుంది: ఈదేశం 15 సంవత్సరాల్లో యీ పరివర్తనా క్రమాన్ని పూర్తిచేసి, ఒక గాటిన పడుతుందని ఆశించరాదు. ఎందుకంటే, మార్పంటే ప్రగతే కాబట్టి అది నిరంతరక్రమంగా వుండాలి.

ప్ర: పెరిస్త్రోయికా భావనపట్ల మీ అభిప్రాయ మేమిటి?

జ: ప్రస్తుత సంస్కరణల సారాంశం నూతన సాంకేతిక పద్ధతులను రూపొందించడమో లేక వాటిని కొనుగోలు చేయడమోనన్న తప్పు దృక్పథం మేనేజిమెంటు ఉద్యోగాల్లోని కొంత మందికి వుంది. సాంకేతిక శాస్త్రకళలో అవసరమైన దశనందుకోవడంతో పెరిస్త్రోయికా పరిపూర్తి అవుతుందనుకుంటున్నారు.

ప్ర: అయితే మరి ఏది అతిముఖ్యమైనదని మీ అభిప్రాయం?

జ: అది మానవాంశమని అనుకుంటున్నాను. దీన్ని గురించి సోవియట్ యూనియన్‌లో ఎక్కువ మాట్లాడుతూన్నారేకాని, వాస్తవంలో తరచు విస్మరిస్తున్నారు.

ప్ర: సంస్కరణలకు ప్రధానంగా అడ్డం వస్తున్నది. బ్యూరాక్రసీయేనన్న అభిప్రాయం సోవియట్ యూనియన్‌లో విస్తృతంగా ఉంది. బ్యూరాక్రాట్లను మరింత సమర్థంగా కృషి సల్పేలా చేయగలమని అభిప్రాయపడుతున్నారా?

జ. అవును. వారితో మరింత బాగా పని చేయించ వీలుంది. ఉత్పత్తిదారులపై చీటికి మాటికి పెత్తనం చేయడం తప్ప మరొకపని లేని బ్యూరాక్రాట్లను ఇంటికి సాగనంపవచ్చు. ఇలాంటి పెత్తనం ఉత్పత్తి దారుల పనికిదెబ్బ. ఇక మంత్రులకు సంబంధించినంత వరకూ, వారు నిర్దిష్ట పరిశ్రమల ఆర్థిక వ్యూహానికి సంబంధించిన విషయాలను చూడాలి.

వాస్తవానికి బ్యూరాక్రటిక్ యంత్రాంగం తనదైన అధికార వ్యవస్థను యేర్పరుచుకొంటుంది. ఇది హడలు పుట్టించే వాతావరణాన్ని సృష్టిస్తుంది. తాను బహు అరుదుగా చూచే తనపై ఉద్యోగికి కింది ఉద్యోగి భయపడుతుంటాడు. ఎక్కడ తప్పు చేస్తానో అని అతని భయం. అందువల్ల కొందరు తప్పుచేసే ప్రమాదం నుంచీ తప్పుకునేందుకు చేతులు ముడుచుకుని కూచుంటారు. ఈ అధికార వ్యవస్థలో ఎవరైనా బాగా పనిచేస్తే వారు ప్రతిఫలం పొందే అవకాశం లేదు

ప్ర: ఇటువంటి వ్యవస్థను ఎలా మార్చడం?

జ: ఉన్నత అధికార స్థానాల్లో వున్న వారే దీన్ని మార్చాలి. సిబ్బంది పని అంచనాకూ, ప్రమోషన్లకూ, ప్రోత్సాహకాలకూ కొత్త గీటురాళ్ళు అవసరం. ఇవన్నీ మానవాంశంలోని భాగం. ప్రభుత్వ బ్యూరాక్రాట్లకూ, ఉత్పత్తిదారుకూ మధ్య ఘర్షణకు తావివ్వని పరిస్థితిని సృష్టించాలి.

సో.స చర్చావేదిక

# సోషలిజంలో జాతుల మధ్యా సంబంధాలు

జాతుల సమస్యపై లెనిన్ సూత్రాలను అమలు జరపడం, అసంఖ్యాక గతానుగతికతలను, పిడిసూత్రాలను, వక్రీకరణలను అధిగమించడం ఎంత తక్షణావసరమో, తప్పనిసరో సోవియట్ యూనియన్‌లోని పౌర జీవిత సమస్త అంశాల ప్రజాస్వామ్యీకరణ నిరూపిస్తోంది.

జాతులు, జాతుల సంబంధాల సిద్ధాంతాన్ని వివరించే నిర్దిష్టమార్గా లేమిటి? జాతుల సంబంధాల్లో ఎటువంటి ప్రజాస్వామ్యీకరణ జరుగుతుంది? సోషలిజంలో జాతుల మధ్య సంబంధాల్లో వైరుధ్యాలకు మూలకారణాలేమి? వీటిని అకడమీషియన్ వై.బ్రోమ్లీ, ఎ.ప్రజౌస్కాస్, క్యాండిడేట్. సైన్స్ (చరిత్ర), పి. కాన్‌ధేల్, క్యాండిడేట్, సైన్స్ (చరిత్ర) చర్చిస్తున్నారు.

## వై. బ్రోమ్లి

జాతుల గురించిన సమస్యల పరిశీలనలో యేర్పడిన స్తబ్ధతను తొలగించడానికి కొత్త ఆలోచనాధోరణి అవసరమవుతోందనేది విదితమే. ప్రకృతీ, సమాజంలోని ఇతర పరిణామాలన్నిటి లాగనే, నరవర్గ పరిణామక్రమాలలో సార్వత్రిక లక్షణాలూ, ప్రత్యేక లక్షణాలూ గతితార్కికంగా మిళితమై ఉంటాయి. ఈ నియమము పరస్పరం ముడిపడి ఉన్న రెండు ధోరణులలో కనిపిస్తోంది: ఒకటి ఏకీకరణ ధోరణి. రెండవది వేరుపడే ధోరణి. అయితే, ప్రతి చారిత్రక దశలో ఈ ధోరణుల పరస్పర సంబంధం, వాటి రూపాలు మారుతుంటాయి

పెట్టుబడిదారీ విధానపూర్వపు సమాజాల్లో లాగా పెట్టుబడిదారీ వ్యవస్థలోను ఏకీకరణ ధోరణి ప్రధానమైన జాతులకు, ఉపజాతులకు మాత్రమే పరిమితమైనది కాదు. అది అంతర్ నరవర్గ, అంతర్జాతీయ స్వభావం కలది కూడ. లెనిన్ చెప్పిన కింది మాటలకు అర్థమదే: "పెట్టుబడిదారీ విధానంలో ఇప్పటికే ఆర్థిక, రాజకీయ, ఆత్మిక జీవితం అంత

కంతకు అంతర్జాతీయమవుతోంది. సోషలిజం దాన్ని పూర్తిగా అంతర్జాతీయం చేస్తుంది.

ఈ విషయం మనం జ్ఞాపకముంచుకోవాలి. ఎందువల్లనంటే సోవియట్‌యూనియన్‌లో జాతీయజీవిత భవిష్యత్తును ప్రపంచ చారిత్రక నేపథ్యంతో సంబంధం లేకుండా వివరించ బూనుకోవడం, జాతీయ సమాజాలు సుస్థిరమైనవి, శాశ్వతమైనవి అనే చారిత్రక నిర్ణయాలకు దారితీయవచ్చు. సుదూర భవిష్యత్తులో జాతులు పూర్తిగా అదృశ్యమవు తాయనికాదు నా భావం. వర్గాలు అదృశ్యమైన తర్వాత జాతులు, వాటి ప్రత్యేక జాతీయ లక్షణాలు చాలా కాలంపాటు ఉంటాయి. కానీ, ఆయా జాతులు, వాటి ప్రత్యేక లక్షణాలు శాశ్వతంగా ఉండవు. ఇది చారిత్రక సత్యం. సోషలిస్టు సమాజంలో జాతుల ఏకీకరణ, వేర్పాటు ధోరణులు సమూలమైన మార్పులకు లోనవు తాయి.

లెనిన్ దూరదృష్టితో చెప్పినట్లు దేశ రాజ కీయ, ఆర్థిక, సాంస్కృతిక జీవిత అంతర్జా తీయకరణ పెంపొందడంలో జాతుల ఏకీ కరణ ధోరణి కనిపిస్తోంది. ఈ ధోరణి వల్ల, ఒక కొత్త అంతర్జాతీయ ప్రజాకుటుంబం, అంటే సోవియట్ ప్రజ అనేది అవతరించిందని కూడా మనకు తెలుసు. కానీ, అటువంటి కొత్త చారిత్రక కుటుంబం ఇంకా ఏర్పడలేదని, వివిధ భాషలు, సంస్కృతులు, సంప్రదాయాలు, చారిత్రక ప్రత్యేకతలను ఒకదానికొకటి మరింత దగ్గరగా తీసుకురావటం ద్వారా అటువంటి ప్రజాకుటుంబాన్ని నిర్మించవలసి ఉందని ఇటీవలి కొన్ని సోవియట్ గ్రంథాలు చెబుతున్నాయి.

కాని, ఉమ్మడి సాంస్కృతిక లక్షణాలు, ఉమ్మడి సంప్రదాయాలు, జాతుల పరస్పర భావప్రకటనకు ఉమ్మడి భాషగల అటువంటి జాతుల, నరవర్గబృందాల కుటుంబం చాలానాళ్ళుగా ఉందని మనకు బాగా తెలుసు. ఇది జాతుల చరిత్రనుంచీ వైదొలగిన పరిణా మంగా భావించరాదు. జాతులమధ్య ఏకీకరణ క్రమాన్ని ఒక ఉన్నతస్థాయికి తీసుకెళ్ళే ప్రపంచ చారిత్రక పరిణామంలో యిది ఒక సహజదశే. సోవియట్‌యూనియన్‌లో సాగుతున్న జాతీయ క్రమాల భవిష్యత్తును గురించి మాట్లాడుతున్నప్పుడు, ఈ దేశం నగరవాసుల సమాజంగా మారిపోతూందని మనం గుర్తుంచుకోవాలి. ఇందువల్ల, పని, నిత్య జీవిత రంగాల అంతర్జాతీయకరణ మరింత పెంపొందుతుంది. ప్రజలు ఒకచోటినుండీ మరొకచోటికి తరలిపోవడం, జాతులు మిళితం కావడం హెచ్చుతుంది.

**సోవియట్ యూనియన్‌లో సాగు తున్న జాతీయక్రమాల భవిష్యత్తును గురించి మాట్లాడుతున్నప్పుడు, ఈ దేశం నగరవాసుల సమాజంగా మారిపోతూందని మనం గుర్తుంచు కోవాలి. ఇందువల్ల, పని, నిత్యజీవిత రంగాల అంతర్జాతీయకరణ మరింత పెంపొందుతుంది. ప్రజలు ఒక చోటినుండి మరొకచోటికితరలి పోవడం, జాతులు మిళితం కావడం హెచ్చుతుంది.**

సమానత, పరస్పర గౌరవం, పరస్పర సహాయ, సహకారాల ప్రాతిపదికపై నెలకొన్న జాతుల పరస్పర సంబంధాలనే వాటి అంత ర్జాతీయతగా సోషలిజం వ్యాఖ్యానించింది.

ఎ. ప్రజౌస్కాస్

జాతుల గురించిన సిద్ధాంతంలో ఏమేమి నూతన విషయాలను ప్రవేశపెట్టారు, మన మెదుర్కొంటున్న సమస్యలను అధ్యయనం చేయడానికి ప్రస్తుతం ఉన్న సైద్ధాంతిక భావాలు చాలునా అన్న సంగతిని గురించి చెబుతాను.

# సోషలిజంలో జాతుల మధ్య సంబంధాలు

1920ల ఉత్తరార్థంలో రూపొందిన, 1980ల మధ్యం నాటివరకూ కొన్ని మార్పులతో నిలిచి వున్న రాజకీయ వ్యవస్థను గురించిన ఆధునిక భావాలకు, లెనినిస్టు జాతుల విధాన విజయాలను గురించిన సూత్రీకరణ పొసగకుండా ఉండటమే జాతుల సమస్యలపై వచ్చిన కొన్ని గ్రంథాల్లోని ప్రధాన లోపమని నాకనిపిస్తోంది. సోషలిజం నిర్మాణం గురించిన లెనిన్ సూత్రాలనుండీ వైదొలగడం, మౌలిక ప్రజాస్వామ్య ప్రమాణాలను నిరాకరించడం; ఆ కాలం నాటి అరాచకం, మూకుమ్మడి బీభత్సం— యివి జాతుల విధానం పైన జాతుల మధ్య సంబంధాలపైన ప్రతికూల ప్రభావం నెరపాయి. 1920 ల చివర్లో, 1930 ప్రారంభంలో మనదేశం లెనిన్ జాతుల విధానం నుండీ వైదొలగి, ఈ రంగంలోనూ, పౌరజీవితంలోని యితర రంగాల్లోనూ స్టాలినిస్టు సూత్రాన్ని అమలు జరప నారంభించిందని ఒప్పుకుని తీరాలి. ఆ మార్పు గురించి సమగ్ర విశ్లేషణ జరపాలంటే, ఆ కాల సమాచారమంతా సులభంగా అందుబాటులో ఉండాలి. అయితే, స్టాలిన్ జాతుల విధానంలోని ముఖ్యమైన విషయాలు సుస్పష్టమే.

మొదటి విషయం ప్రభుత్వాధికార అపార కేంద్రీకరణ. స్టాలిన్ పరిపాలనా వ్యవస్థకు యేకకేంద్ర రాజ్యవ్యవస్థ అవసరం. అది, సమాన ప్రతిపత్తిగల సార్వభౌమ రిపబ్లిక్కుల సమాఖ్య అన్న లెనిన్ భావన అమలు జరిగే అవకాశం లేకుండా చేసింది. దేశంలోని నిజమైన అధికారమంతా కేంద్ర కార్యనిర్వాహక సంస్థల చేతుల్లోకి వెళ్ళింది. ఫెడరలిజం ప్రధాన లక్షణాల్లో ఒకటి, కేంద్రానికీ, రిపబ్లిక్ ప్రభుత్వ సంస్థలకూ మధ్య అధికారాల విభజన. దీనికి పూర్తిగా ఆస్కారం లేకుండా చేయడం జరిగింది. ఈ కేంద్రీకరణ ధోరణి స్తబ్ధతా కాలం వరకూ కొనసాగింది. దీనికి లోతైన చారిత్రక మూలాలు ఉన్నాయి. అయితే దీని నిర్దిష్టరూపాలు స్టాలినిజం నుండి వారసత్వంగా వచ్చినవె

రెండవది భాషా విధానం. 1930 లలో ముఖ్యంగా రష్యన్ భాషను నేర్చుకోవడం నిర్బంధం చేసిన 1938 డిక్రీతో, రష్యన్ భాషను నేర్చుకోవడం ఐచ్చికం చేయాలన్న సూత్రాన్ని తుంగలో దొక్కేశారు. రష్యన్ నిర్బంధ అధ్యయన అంశమైంది. కొన్ని స్వయంపాలక రిపబ్లిక్కుల్లో అది ఏకైక అధికార భాష అయింది.

మూడవది. వాస్తవంగా ఉన్న అసమానతను అధిగమించడానికి చేసిన ప్రయత్నాలేవీ ఫలించలేదు. 1940ల నుండి కేంద్ర యంత్రాంగం సోవియట్ సమాజ బహుళ జాతి లక్షణాన్ని ప్రతిబింబించడంలో స్పష్టంగా విఫలమైంది. స్థానిక ప్రజలు విద్యావంతులై, సామర్థ్యం పొందినప్పటికీ వారి పరిస్థితి అక్టోబరు విప్లవానంతర దశాబ్దారంభం నాటి స్థితితో పోల్చి చూచినప్పుడు, పెద్దగా మారలేదు.

నాల్గవది. సమస్త జాతుల జాతీయ ప్రయోజనాల విషయంలో లెనిన్ తక్షణం ప్రతిస్పందించేవారు. యిలాంటి ప్రతిస్పందన సార్వభౌమ రిపబ్లిక్కుల సమాఖ్య భావనను ప్రేరేపించింది. యిది దేశమంతటా చెల్లా చెదురుగా ఉన్న యూదులు, లాత్వియన్ల లాంటి జాతీయ బృందాల పాఠశాలలనూ, ప్రచురణాలయాలను, సాంస్కృతిక సంస్థలను కాపాడటానికి తోడ్పడింది. స్టాలినిజం సాంస్కృతిక స్వయం ప్రతిపత్తి జాడలేకుండా చేసింది.

ఒక కొత్త చారిత్రక ప్రజాకుటుంబంగా సోవియట్ ప్రజ రూపుగొనడం, జాతుల వికాసం, జాతులు ఒకదానికొకటి దగ్గర కావడం — వీటిని గురించిన సూత్రీకరణను పునఃప

# సోషలిజంలో జాతుల మధ్య సంబంధాలు

రిశీలించటం నిస్సందేహంగా అవసరం.

బహుళ జాతి సమాజం ఒకే సామాజిక-రాజకీయ ప్రజా కుటుంబంగా ఏర్పడి జాతులు ఒకదానికొకటి దగ్గరయ్యే క్రమం సంక్లిష్టమైనది. సోవియట్ గ్రంథాలు ఈ క్రమాలను సర్వసమగ్ర దృష్టితో విశ్లేషించడానికి బదులు, సామాజిక ఏకరూపతగల సోషలిస్టు జాతులు ఆవిర్భవించాయని నిరూపించేందుకై పారిశ్రామిక అభివృద్ధి రేట్లు, విద్యాస్థాయి మొదలైన వాటిని ఉదహరించాయి. ఈ పద్ధతి ప్రాంతీయ వ్యత్యాసాలను విస్మరిస్తుంది. ఇటీవలికాలంలో సామాజిక శాస్త్రజ్ఞులు మొదటిసారిగా ఈ సమస్యలను అధ్యయనం చేసి, పుస్తకాలను కూడా ప్రచురించారు. అందువల్ల, జాతులు పరస్పరం సన్నిహితం కావడంపైన, సోవియట్ ప్రజ అనేది రూపొందడంపైన మరీ సరళీకృతమైన అభిప్రాయాలను సోవియట్ సామాజిక శాస్త్రం విసర్జించగలదని మనం ఆశించవచ్చు.

అదేవిధంగా, జాతుల వికాసంపై సిద్ధాంతాన్ని కూడా పునస్సమీక్షించటం అవసరం. ఉన్నత జీవనప్రమాణాలు, పారిశ్రామికీకరణ, విద్య, స్థానిక సిబ్బంది శిక్షణల్లో విజయాలు మాత్రమే జాతుల వికాసానికి గీటురాయి కాదు. జాతీయ సంస్కృతుల అవతరణ, వికాసాలను పరిగణనలను తీసుకున్నప్పుడే అవి అటువంటి గీటురాళ్ళవుతాయి. విడివిడి జాతుల, నరవర్గ-బృందాల ప్రతిపత్తిని పరిశీలిస్తే, పరస్పర విరుద్ధమైన దృశ్యం మన కగుపిస్తుంది. ఉదాహరణకు, బాల్టిక్, మధ్య ఆసియా, ట్రాన్స్‌కకేషియన్ జాతుల సంస్కృతులు వికసించాయి. మరోవైపు, మరికొన్ని డజన్ల జాతుల సంస్కృతులూ, భాషలు పూర్తిగా నశించిపోయే స్థితిలో ఉన్నాయి. అవి ఎక్కువగా నిత్యజీవితంలో మాత్రమే నిలిచి ఉన్నాయి. ఆయాజాతుల భాషల్లో ప్రచురణలు, పత్రికలు క్రమక్రమంగా తగ్గిపోతున్నాయి.

ఒకవైపు ఒక భాషను మరొకభాష కబళించివేయడం, మరోవైపు జాతీయ చైతన్యం పెరుగుదల, ఒకవైపు జాతి విచ్ఛిన్నత, మరోవైపు దాని పటిష్టీకరణ— ఈ పరస్పర విరుద్ధ ధోరణుల ఘర్షణవల్ల ప్రజల్లో ఒకపెద్ద భాగపు వ్యక్తిత్వంలో సంక్షోభానికి ధారితీయడంతో సంకుచిత జాతీయవాద భావాలు తలయెత్తుతాయి. స్టాలినిస్టు, స్తబ్ధతాదశల్లో ఉధృతమైన ఏకీకరణ మూలంగా విషమించిన జాతీయ సమస్యలను ప్రజాస్వామ్యీకరణ, బాహాటతా క్రమాలు బయటపెట్టాయి. ఈ విషయంలో పాత పిడిసూత్రాలను, భావాలను సైద్ధాంతికంగానూ, ఆచరణలోనూ అధిగమించి జాతుల విధానానికి సంబంధించిన లెనిన్ సూత్రాలను పునరుద్ధరించినట్లయితే, పెరిస్త్రోయికా గతిక్రమంలో అన్నిజాతుల ప్రయోజనాలను పరిగణనకు తీసుకున్నట్లయితే ఈ సమస్యలను పరిష్కరించ వీలువుతుంది.

**ఒక కొత్త చారిత్రక ప్రజా కుటుంబంగా సోవియట్‌ప్రజ రూపొందడం, జాతుల వికాసం, అవి ఒకదానికొకటి దగ్గరకావడం— వీటిని గురించిన సిద్ధాంతాన్ని పునః పరిశీలించటం నిస్సందేహంగా అవసరం.**

పి. కాన్‌దేల్

రానున్న సంవత్సరాల్లో, ముఖ్యంగా జాతుల మధ్య సంబంధాల విషయంలో,

# సోషలిజంలో జాతుల మధ్య సంబంధాలు

జాతిప్రయోజనాలు ముఖ్యమా, మానవాళి ప్రయోజనాలు ముఖ్యమా అనే ప్రశ్నకు మన సమాజం సమాధానమివ్వవలసిన సందర్భాలు తలఎత్తుతాయి: జాతీయ ప్రయోజనాలకూ, మానవాళి ప్రయోజనాలకూ మధ్య అంత స్సంబంధం గురించిన సమస్యకు నేను ప్రాధాన్యమిస్తున్నాను. యెందుకంటే, జాతీయ లక్షణాల హక్కులను పునరుద్ధరించటంతోనే, సమస్త జాతీయ సమస్యలు, అన్ని సామాజిక సమస్యలు సైతం పరిష్కారమవుతాయని మనలో అనేకులు భావిస్తున్నారు. జాతీయ ప్రయోజనాల ఉల్లంఘనను అధిగమించడానికి వారు చేసే కృషి, ఆ ప్రయోజనాలకు దోహదం చేయాలనే వారి వాంఛ ఫలితంగా సార్వత్రిక మానవప్రయోజనాలు జాతీయ ప్రయోజనాలుగా దిగజారి వాటిచే కబళింపబడే ప్రమాదం అనివార్యంగా తలయెత్తుతుంది. ఈ సమస్యలు ప్రతిఒక్కరికీ ముఖ్యమైనవి. కాబట్టి, రాజ్యస్థాయిలోనూ, సైద్ధాంతికంగానూ ప్రాధాన్యతను సంతరించుకుంటున్నాయి. బోధనాభాష, రాజ్యభాషలు, జాతీయ అనుబంధం వంటి ముఖ్య సమస్యలను తీసుకుని చూద్దాం.

ఏ జాతిలోనైనా సరే చేరిపోయి దాన్ని తన జాతిగా స్వీకరించడం ప్రతి పౌరుని ప్రాథమిక హక్కులలో ఒకటి. అదేవిధంగా ఏ జాతిలోనూ చేరకుండా ఉండే హక్కుకూడా ప్రతి పౌరుడికీ ఉంది. పౌరులచే ఈ జాతి స్వీకారాన్ని ప్రభుత్వ ప్రమాణంగా మార్చి దాన్ని ప్రభుత్వ అధికారంతో నియంత్రించటం, ఆ ప్రాతిపదికపై భాషావిదానాన్ని రూపొందించటం, వ్యక్తి పౌరహక్కులను ప్రజాస్వామిక స్వేచ్ఛలను ఉల్లంఘించటమే అవుతుంది. తమ పిల్లలను రష్యన్ బోధనా భాషగాకల పాఠశాలకు పంపాలో, లేక, ఇంకొక భాషా పాఠశాలకు పంపాలో నిర్ణయించవలసింది తల్లిదండ్రులే. ప్రతిపౌరునికి, అతని నివాస స్థలంతోనూ, జాతితోనూ నిమిత్తం లేకుండా ఇందుకు తగిన పరిస్థితులను ప్రభుత్వం సమకూర్చాలి.

కాని, సోవియట్ రాజకీయ వ్యవస్థ ఈ లక్ష్యసిద్ధికి అనుగుణంగా నిర్మాణం కాలేదు ఎందువల్లనంటే, అది పైకి మాత్రమే ఫెడరల్ స్వభావం కలది. నిజమైన ఫెడరల్ వ్యవస్థకు తప్పనిసరిగా ఉండవలసిన యంత్రాంగాలు దానికి యింకా లేవు.

ఒక జాతి ప్రజలను వేరొక జాతిలో బలవంతంగా కలిపి వేయడం ఎంత అప్రజాస్వామికమూ, అమానుషమో, ఒక జాతిప్రజ మరొక జాతిలో సహజంగా విలీనమయ్యే క్రమాన్ని అడ్డుకోవడం కూడ అంత అప్రజాస్వామికమూ, అమానుషమూను.

సిబ్బంది నియామక విషయంలో కూడ యిదే జరుగుతోంది. ప్రభుత్వ, పాలనా యంత్రాంగ సంస్థల్లో ఏదో ఒక జాతి ప్రతినిధుల ప్రాబల్యం, జాతుల సమానతా సూత్రానికి విరుద్ధం. దామాషా ప్రాతినిధ్యం ఈ సూత్రానికి అనుగుణమైనదిగా తోస్తుంది. కాని, ఉద్యోగాల్లో నియామకానికి, సామర్థ్యంకాక, జాతిని గీటురాయిగా చేస్తే, పౌరుడు జనాభాలో తన జాతి ప్రజల నిష్పత్తి ననుసరించి నియామకమై పైకిపోయే అవకాశాల దృష్ట్యా వృత్తిని ఎంచుకోవలసి వస్తుందే తప్ప, తన అభిరుచిని బట్టి కాదు. అందువల్ల, జాతి అసమానతలను తొలగించేందుకు చేసే ప్రయత్నం, జాతి వివక్షకు పౌరుల స్వేచ్ఛా, సమానతా సూత్ర ఉల్లంఘనకు దారితీస్తుంది.

ప్రభుత్వ యంత్రాంగం అనుసరిస్తున్న జాతీయ శూన్యతావాదమే జాతులసమస్య విషయంలోని అన్యాయాలకు కారణమని చాలామంది అభిప్రాయం. మన గతచరిత్రను బట్టి యిలాంటి అభిప్రాయం తలయెత్తిందే తప్ప, ఇది అంత సరియైన విశ్లేషణ కాదు.

ఈ శూన్యతావాదం ప్రదర్శితమైనది కొన్ని జాతుల విషయంలోనే. ఇతర జాతుల పట్ల ప్రభుత్వ సంస్థలు ఉదారంగా వ్యవహరించాయి జాతి ప్రయోజనాలను నిరాకరించడంవల్లనో, ఆమోదించడంవల్లనో ఈ సమస్య పరిష్కారం కాదు. జాతుల సమస్య విషయంలో, హుకుముల ద్వారా వ్యవహారాల నిర్వహణను ఆపివేయడమే అనుసరణీయ మార్గం.

రష్యనేతర భాషల్లో విద్యాబోధన పరిస్థితి, వివిధ రష్యనేతర జాతులకు చెందిన బుద్ధిజీవులకు ఆందోళన కలిగిస్తోంది. తమ ప్రజల భాషా, సంస్కృతులపట్ల శ్రద్ధ వహించని మేధావులు ఎందుకూ కొరగారనేది నిజమే. అదే సమయంలో, తమ మాతృభాషను, సంస్కృతిని రక్షించాలనే తాపత్రయంతో ఆ భాషను ఆయా జాతీయ రిపబ్లిక్‌లో అధికార భాషగా చేయడం, ఇతర జాతులకు అన్యాయం చేయడమే. సైబీరియాలోని కొన్ని చిన్న వర్గాలకు చెందిన భాషలు దాదాపు అంతరించిపోతున్నాయి. వాస్తవానికి అవి ఆధునిక నాగరిక జీవితంతో సహజీవనం చేయజాలవు. వాటిని బలవంతాన అట్టిపెట్టి, నరవర్గాలపై రుద్దడం ఆ జాతులను పురాతన జీవిత విధానానికి బందీలుగా చేసే అమానుష చర్యతప్ప మరొకటి కాదు. బలవంతాన భాష జీవితాన్ని పొడిగించడం ఎంత తప్పో, జాతుల సమానత పేరుతో, ఆ భాషను వారిపై రుద్ది, ప్రపంచ సంస్కృతీ, నాగరికతలను వారు స్వీకరించకుండా అడ్డుపడటం అంత తప్పే.

పెద్ద పెద్ద జాతీయ సమాజాలను కూడ ఈ ప్రపంచ పరిణామక్రమాలు ప్రభావితం చేస్తున్నాయి. ఇవి అసంకల్పితమైన సహజక్రమాలు. సామాజిక జీవితం అంతర్జాతీయ స్వభావం సంతరించుకునే కొద్దీ, ఆధునిక నాగరికత ప్రపంచమంతటా విస్తరించే కొద్దీ, ఈ క్రమాలు బలపడుతాయి. జాతుల చారిత్రక అస్తిత్వాన్ని క్రమక్రమంగా అంతరింప చేస్తాయి.

జాతీయ, మానవీయ లక్షణాలమధ్య వాస్తవంలో గతి తార్కిక వైరుధ్యం ఉంది. అందువల్ల, జాతీయ ప్రయోజనాలకు పెద్ద పీటవేయడం వల్ల యెవరికీ హాని జరగదనీ, అది మానవాళికి మేలే చేస్తుందనీ చెప్పడం సమస్యను మరీ సరళం చేయడమే. ఒక జాతికి తన ప్రత్యేకతను, అనన్యతను గురించిన ఎరుక, మరొక జాతితో పోల్చి చూచుకొన్నప్పుడే కలుగుతుంది. ఈ భిన్నత్వం లేకపోతే జాతీయతకు నిర్మాణ పునాదే ఉండదు. కాబట్టి జాతీయతలో, జాతుల పరస్పర పరిపుష్టీకరణే కాక, పరస్పర ఘర్షణకూడ ఉంది. ఇది జాతీయత వక్రీకరణ కాదు, దాని స్వతస్సిద్ధ గుణం. జాతుల వికాసం, అవి పరస్పరం సన్నిహితంకావడం—ఇవి పరస్పర విరుద్ధ క్రమాలే తప్ప జాతీయ సామరస్యానికి దారితీసే పరస్పర పూరకాలు కాదు.

**దీన్నంతటినీ బట్టి, పెరిస్త్రోయికాకు మొత్తంపై జాతీయ సమస్యల ప్రాముఖ్యం స్పష్టమవుతోంది. సామాజిక జవసత్వాలను జాతీయత రేకెత్తిస్తుంది. వాటిని విశ్వమానవ లక్ష్యాల సాధన దిశగా నవీనీకరణ శక్తులు నడిపించడంపై పెరిస్త్రోయికా విజయం చాల వరకు ఆధారపడి ఉంది.**

దీన్నంతటిని బట్టి, పెరిస్త్రోయికాకు మొత్తంపై జాతీయ సమస్యల ప్రాముఖ్యం స్పష్టమవుతోంది. సామాజిక జవసత్వాలను జాతీయత రేకెత్తిస్తుంది. వాటిని విశ్వమానవ లక్ష్యాల సాధనదిశగా నవీనీకరణ శక్తులు నడిపించడంపై పెరిస్త్రోయికా విజయం చాలవరకు ఆధారపడి ఉంది.

# మనకు బూరన్ ఎందుకు?

సోవియట్ షటిల్స్ డిజైనర్
యూరి సెమెనెవ్ తో
ఇజ్వెస్తియా ఇంటర్వ్యూ



యూరిసెమెనవ్ (జననం 1935) ద్నెప్రో పెట్రోవ్స్క్ యూనివర్శిటీ పట్టభద్రుడు. ప్రస్తుతం యీయన ఎనర్జియా అసోసియేషన్ ఛీఫ్ డిజైనర్ వి. గ్లష్కోకు డిప్యూటీగా పనిచేస్తున్నాడు, యీయన బూరన్ రోదసి షటిల్‌ను, మానవ సహిత అంతరిక్ష నౌకలను, వేదికలను రూపొందించాడు. సోవియట్ విజ్ఞానశాస్త్రాల అకాడమీ కరెస్పాండింగ్ సభ్యుడు అయిన సెమెనవ్ శ్రమవీర బిరుదాంకితుడు, లెనిన్ బహుమతిని, కొన్ని ప్రభుత్వ బహుమతులను గెల్చుకున్నాడు.

ప్రశ్న: పెద్దయెత్తున వస్తువులను రోదసి నుండి భూమిపైకి తీసుకురాగల బూరన్ రోదసి షటిల్ సాంకేతిక రంగంలో మనం సాధించిన ఒక ప్రధాన విజయం. అనేక కృత్రిమ ఉపగ్రహాలు అంతరిక్షంలో చాలాకాలంపాటు పనిచేసిన తర్వాత పనికిరాకుండా పోతున్నాయి. వాటిని తీసుకురావడం సాధ్యమేనా?

జవాబు: అసాధారణమైన, ఖరీదైన పరికరాలను తిరిగి భూమిపైకి తీసుకురావడం అవసరమే. లేని పక్షంలో అవి వాతావరణాన్ని, భూమ్యుపరితలాన్ని కలుషితం చేస్తాయి.

భూమిపైకి తిరిగి వస్తువులను తీసుకురావడమనేది మన కార్యక్రమంలోని ఒక భాగం మాత్రమే. అసాధారణ పరికరంతో విలువైన వస్తువులను భూకక్ష్యలో తిప్పడం మన ప్రధాన లక్ష్యం. ఉదాహరణకు అధునాతన ఎలక్ట్రానిక్ పరికరంతో ఒకపెద్ద ఆప్టికల్ టెలిస్కోప్‌ను కక్ష్యలో ప్రవేశపెట్టడం. మనం కక్ష్యలో పెద్ద రేడియో-టెలిస్కోప్‌లను, ఆన్టెనా వ్యవస్థలను, సౌరవిద్యుత్కేంద్రాలను, అంతర్‌గ్రహ సముదాయాలను కూర్చవచ్చు. వీటిని మరమనుషుల ద్వారా, ప్రవీణులద్వారా మంచి స్థితిలో వుంచవచ్చు.

ముఖ్యమైన యూనిట్లను సమగ్రంగా



బూరన్ షటిల్,
ఎనర్జియా బూస్టర్

## మనకు బూరన్ యెందుకు?

పరీక్షించేందుకు బూరన్ రోదసి షటిల్‌ను అంతరిక్షప్రయోగశాలగా వినియోగించుకోవచ్చు. మానవసహిత అంతరిక్ష నౌకలను కక్ష్యలో నడిపిన, మరమ్మతు చేసిన అనుభవం వుంది. మానవరహిత అంతరిక్ష నౌకలకు యీ అనుభవాన్ని వినియోగించడానికి బూరన్ తోడ్పడుతుంది. అంతరిక్షంలో ఐదేళ్లుగా పనిచేస్తున్న శాల్యూట్-7-కాస్మోస్-1686 సముదాయపు కక్ష్యను మార్చే విషయాన్ని 1986 లో మేము చర్చించాం. బూరన్ ద్వారా యీ సముదాయంలోని కొన్నిభాగాలను 1995-2000లో భూమిపైకి తీసుకురావాలని అప్పుడే అనుకున్నాం. యీభాగాలు విజ్ఞాన శాస్త్రజ్ఞులకు యెంతో విలువైన సమాచారాన్ని అందిస్తాయి.

ఒకకిలోగ్రామ్ బరువును కక్ష్యలో ప్రవేశ పెట్టడానికి వేలకొలది రూబుళ్లు (లేదా డాలర్లు) ఖర్చుఅవుతాయి. ఎనర్జియా బూస్టర్ కూడా యిందుకు మినహాయింపు కాదు. యింతవరకూ ఒకే అంచెలో దూసుకుపోయే అంతరిక్షనౌకే అన్నిటికన్నా పొదుపైనది. అందువల్ల మనం బూరన్-ఎనర్జియా వ్యవస్థను, ఒకే అంచెగల రోదసి నౌకలను-యీరెంటినీ వాడాలని నిర్ణయించుకున్నాం.

అమెరికన్లు మనలాగా కాకుండా రోదసీ షటిల్స్‌ను మాత్రమే వినియోగిస్తున్నారు. ఎంచేతనంటే ఒకే అంచెలో దూసుకెళ్ళే అంతరిక్ష నౌకలవల్ల ఒనగూడే ఫలితాలను వారు తక్కువ అంచనావేసి వాటి వుత్పత్తిని నిలిపివేసి, రోదసీషటిల్స్‌పై విపరీతమైన ఖర్చు చేశారు. తమ నిర్ణయం సరైంది కాదని గుర్తించి యిప్పుడు ఒకే అంచెలో దూసుకెళ్ళే డెల్టా-2 రోదసీనౌక ఉత్పత్తిని ప్రారంభించారు.

పలురకాల వస్తువులను, వ్యవస్థలను అంతరిక్షంలో అనుసంధించగల అంతరిక్ష నౌకను సోవియట్ శాస్త్రజ్ఞులు రూపొందించారు. దీని ద్వారా అంతరిక్షంలో భారీసదుపాయాలను సమకూర్చుకోవచ్చు. ఉదాహరణకు కుజగ్రహానికి మానవుని యాత్రను తీసుకుందాం. యిందుకు కక్ష్యలో 450 టన్నుల అంతర్గ్రహ సముదాయాన్ని నిర్మించాల్సి వుంటుంది. యిందుకు అవసరమైన విడివిడి బ్లాకులను బూరన్-ఎనర్జియా వ్యవస్థ అక్కడికి తీసుకెళ్ళ గలదు.

ప్ర : అమెరికన్ రోదసీషటిల్ కార్యక్రమ ప్రారంభ ఖర్చు పది బిలియన్ డాలర్లు మించి పోయింది. ఎనర్జియా-బూరన్ వ్యవస్థపై మనం యెంత ఖర్చుచేశాం? ఆ డబ్బు మన కెప్పుడు వస్తుంది? దాని వల్ల సాంకేతికంగా మనకు లభించే ఫలితాలేమిటి?

జ: ఖర్చు దాదాపు సమానమే. యీ వ్యవస్థలు ఒకదానినొకటి పోలివుంటాయి. కాని సోవియట్ షటిల్‌లో సాంకేతికపరంగా యెన్నో ఆధిక్యతలున్నాయి. పౌర పరిశ్రమల్లో వీటి వినియోగం వల్ల ఆదాయం మిలియన్లలో వస్తుంది. యీ కార్యక్రమానికైన. ఖర్చు కన్నా యెంతో ఎక్కువ లాభం ఒనగూడుతుంది.

ప్ర : పెద్దపెద్ద కృత్రిమ ఉపగ్రహాలను, కక్ష్యలో తిరిగే వేదికలను, అంతర్గ్రహ వేదికలను నిర్మించడానికి ఎనర్జియా అంతరిక్షనౌక మార్గాన్ని సుగమం చేసింది. అయితే యిందుకయ్యే ఖర్చును ఊహించలేము. అంతర్జాతీయ సహకారమే యిందుకు సహేతుక పరిష్కారం. ఉమ్మడి సొత్తు ప్రాతిపదికగా వినియోగించుకునేందుకు ఎనర్జియాను మనం ప్రపంచానికి అందుబాటులో వుంచ గలమా?

జ : కొద్దిపాటి పెట్టుబడితో సరళమైన సాంకేతిక సమస్యలన్నిటినీ మనం దాదాపు పరిష్కరించుకున్నాం. భవిష్యత్తు ప్రాజెక్టులకు అంతర్జాతీయ సమాజ సాంకేతిక శక్తిసామర్థ్యాలు

యెంతో అవసరం.ఎందుకంటే యేదేశమైనా, అది యెంతటి సంపన్నమైనదైనా సరే రోదసి పరిశోధన ప్రధాన ప్రాజెక్టులను అది సొంతంగా నిర్మించలేదు.

మానవసహిత కుజగ్రహ యాత్రను లేదా ప్రపంచమంతటికీ రేడియో - టెలిఫోన్ కమ్యూనికేషన్లనే తీసుకోండి. యిందుకు అనేక టన్నుల బరువుగల, సమాచారాన్ని తిరిగి ప్రసారం చేయగల కృత్రిమ ఉపగ్రహాలు అవసరం. వీటికి సమాచారాన్ని గ్రహించగల, ప్రసారం చేయగల, అనేక మీటర్ల పొడవైన ఆన్టెనాలు అవసరం. యిలాంటి కృత్రిమ వుపగ్రహాలను ఎనర్జియా బూస్టర్ కక్ష్యలో తిప్పగలదు. కాని వందల మిలియన్ల పోర్టబుల్-రేడియో, టెలిఫోన్లను అంతర్జాతీయ సంయుక్త కృషితో మాత్రమే ఉత్పత్తి చేయ వీలుంటుంది.

ఇలాంటి ప్రాజెక్టులు యింకా ఎన్నో వున్నాయి. ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితిలో మార్పుల వల్ల ప్రపంచ వ్యాప్త సహకారం సాధ్యమౌతుంది. అంతర్జాతీయ సహకార రంగంగా అంతరిక్షం వుండాలని మన కోరిక. ఎనర్జియా-బూరన్ వ్యవస్థను మొత్తం ప్రపంచానికి యివ్వడానికి మనం సిద్ధంగా వున్నాం.

(ఇజ్వెస్తియా, సంక్షిప్తం)

# తృతీయ ప్రపంచ దేశాలకు ప్రయోజనకరమైన సోవియట్ రోదసీ సాంకేతిక పరిజ్ఞానం

**యూరి యెమ్షనోవ్**

**దూ**ర రోదసి పరిశోధనలో సోవియట్ యూనియన్.ఒక పెద్ద ముందంజ వేసింది. **100** టన్నులకు పైగా బరువుగల వస్తువును కక్ష్యలో ప్రవేశపెట్టే అత్యంత శక్తివంతమైన ఎనర్జియా బూస్టర్ రాకెట్ (**170,000,000** హెచ్.పి. శక్తిగలది), తిరిగి వినియోగించవీలున్న కొత్త సోవియట్ సరకుల అంతరిక్షనౌకను రోదసిలోకి పంపింది. పూర్తిగా స్వయంచలిత మైన యీ మానవరహిత అంతరిక్షనౌకను ప్రాయోగికంగా పరీక్షించారు. ఎనర్జియా బూస్టర్ రాకెట్‌ను **1987** మేలో విజయవంతంగా పరీక్షించారు. దూరరోదసిని, భూమిపై గల జీవకోటి పరిస్థితులను, ప్రకృతి వనరులను యీ నూతన అంతరిక్ష వ్యవస్థ మరింత సమర్థంగా పరిశీలించడానికి తోడ్పడుతుందనడంలో సందేహంలేదు.

రోదసి పరిశోధనల వల్ల సుస్పష్టమైన ఫలితాలు లభిస్తాయనే మాట నిజం. వర్ధమాన దేశాలకు కూడా యిదివర్తిస్తుంది. ఉదాహరణకు కమ్యూనికేషన్స్ కృత్రిమ ఉపగ్రహాల సామర్థ్యానికి రుజువు అవసరం లేదు: దేశదేశాల మధ్య సమాచార మార్పిడిని, రేడియో ప్రసారాలను, టెలివిజన్ కార్యక్రమాలను అవి శీఘ్రతరం చేస్తాయి. ప్రపంచంలోని మారుమూల ప్రాంతాల్లో



బైకనూర్‌లో భారతీయ
కృత్రిమ ఉపగ్రహం
ఐ.ఆర్.ఎస్-1ఎ కూర్పు

కూడా విద్యా, సాంస్కృతిక ప్రమాణాలను పెంచడానికి తోడ్పడుతాయి. వాతావరణ కాలుష్యాన్ని చాలా కచ్చితంగా తెలుపడానికి, అటవీ, జలవనరుల వినియోగాన్ని మెరుగుపర్చ డానికి, ఖనిజనిక్షేపాలను తెలుసుకోడానికి, మరింత కచ్చితమైన పటాలను తయారు చేయడానికి. పెనుతుఫానుల కేంద్రీకరణను, వాటి ప్రయాణ మార్గాలను కనుగొనడానికి కృత్రిమ ఉపగ్రహాలనుండి మనకు లభించే సమాచారం తోడ్పడుతుంది. యీ ఉపగ్రహాలు చేసే పనులన్నిటినీ పేర్కొనడం నిజంగా యెంతో కష్టమైన విషయం.

అంతరిక్షం నుండి అందే సమాచారాన్ని వర్ధమాన దేశాలు వినియోగించుకుంటున్నాయి. ఉదాహరణకు 1984లో సోవియట్ శాల్యూట్-7 అంతరిక్షనౌకలో సోవియట్-భారత సంయుక్త అంతరిక్ష ప్రయోగం వల్ల భారతదేశానికి 4,800 భూభాగాల ఫోటోలు లభించాయి. యివి భారతదేశంలోని 50 శాతానికి పైగా గల భూభాగానికి పరివ్యాప్తమైన ఫోటోలు. వీటి ఆధారంగా భారతదేశంలో 9 వివిధ మండలాల ప్రత్యేక పటాలు తయారుచేశారు. యీఫోటోలు యెంతో కొత్త సమాచారాన్ని సమకూర్చాయి. కర్నాటక రాష్ట్రంలోని తీరస్థ అటవీ ప్రాంతం గత 10 యేళ్లలో తగ్గిపోయిందని యీ ఫోటోలు తెలియజేశాయి. ఫోటోల ఆధారంగా భారతీయ నిపుణులు గుజరాత్

లోని చమురు, గ్యాస్ నిక్షేపాల పటాన్ని తయారు చేశారు. యివి ఆ ప్రయోగం వల్ల లభించిన కొన్ని ఫలితాలు మాత్రమే.

మరో ఉదాహరణ: ఇండొనీషియాకు సొంత కమ్యూనికేషన్ వుపగ్రహాలు (పలాపా) వున్నాయి. వీటి వల్ల భూతల రిలే స్టేషన్ల నిర్మాణానికయ్యే పెద్దమొత్తం ఆ దేశానికి ఆదా అయ్యింది. అంతరిక్షంలోకి వుపగ్రహాలను ప్రయోగించ డానికి అయిన ఖర్చు కన్నా వీటివల్ల అది పొందుతున్న లాభం యెంతో ఎక్కువని విదిత మైంది.

ఏదేమైనప్పటికీ యింత కన్నా తక్కువ ఖర్చుతో పని వెళ్ళదీసుకోవచ్చు. వర్ధమానదేశాలు తమ సొంత వుపగ్రహాలను ప్రయోగించాల్సిన అవసరంలేదు. ఇతర దేశాల వుపగ్రహాలు అందించే సమాచారాన్ని అవికొనుక్కోవచ్చు, లేదా వుపగ్రహాలను అద్దెకు తీసుకోవచ్చు. నిధులు పరిమితంగా వున్న వర్ధమాన దేశాలకు యీ పద్ధతి అనుకూలంగా వుంటుంది.

సోవియట్ రోదసీ సాంకేతిక పరిజ్ఞానం యీ విషయంలో సహాయపడగలదు. రోదసీ సాంకేతిజ్ఞతలను ఆర్థికపరంగా వినియోగించే అంశాలను సమన్వయపర్చే సోవియట్ ప్రభుత్వ సంస్థ-గ్లావ్‌కాస్మోస్-యీ కింది రోదసీ సేవలను అందజేస్తుంది: సోవియట్ బూస్టర్-రాకెట్లతో యితర దేశాల కృత్రిమ ఉపగ్రహాలను రోదసిలోకి పంపుతుంది; భూకక్ష్యలో స్థిరంగా వున్న సోవియట్ కమ్యూనికేషన్ కృత్రిమ ఉపగ్రహాలను (గోరిజాంట్ సీరిస్‌లోనివి) లీజుకు యిస్తుంది. లీజుకు తీసుకున్న వారికి అనుకూలమైన స్థానంలో వాటిని స్థిరపరుస్తుంది.

ఇందుకు షరతులు, సమకూర్చేసేవలు ఎలాంటివి?.

మొదటిది; ఒక నిర్ణీత బరువును అంతరిక్షంలోకి పంపడానికి పాశ్చాత్యకంపెనీలు వసూలు చేసే డబ్బు కన్నా సోవియట్ ఛార్జీలు 1.5 నుండి 2 రెట్లు తక్కువ.

రెండవది, విశ్వసనీయత. సోవియట్ యూనియన్‌కు ఆధార పడదగిన బూస్టర్ రాకెట్లు వున్నాయని రోదసి సాంకేతిజ్ఞతల విషయంలో గుర్తింపు పొందిన నిపుణుడూ, అమెరికన్ ఇంజనీరూ జేమ్స్ ఒబెరెస్ పేర్కొన్నాడు.

మూడవది, సోవియట్ పరికరాల నాణ్యత. సోవియట్ కృత్రిమ వుపగ్రహాల ద్వారా భూభాగపు ఫోటోలను తీయించుకోవాలని అమెరికన్ భూగర్భ సర్వేశాఖ చిత్ర శుద్ధితో వాంచిస్తున్నట్లు న్యూయార్క్ టైమ్స్ ఒక వార్తను ప్రచురించింది. యిదిచాలు నాణ్యతను తెలుపడానికి.

చివరివిషయం. యితరదేశాల కృత్రిమ వుపగ్రహాలను ప్రయోగించే సందర్భంలో శాస్త్ర, సాంకేతిక రహస్యాలకు రక్షణ. గ్లావ్ కాస్మోస్‌తో లావాదేవీలు నిర్వహిస్తున్న యితర దేశాల సంస్థల యింజనీర్లకు, సాంకేతిక నిపుణులకు బైకనూర్ అంతరిక్ష ప్రయోగ కేంద్రాన్ని తెరచి వుంచుతానని సోవియట్ యూనియన్ ప్రతిపాదించింది.

ఒక వర్ధమాన దేశంతో సహకారంలో భాగంగా గ్లావ్‌కాస్మోస్ యిదివరకే ఒక ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి ప్రయోగించింది. 970 కిలోల బరువు, 7 మిలియన్ల డాలర్ల ఖరీదు గల భారతీయఉపగ్రహం ఐ.ఆర్.ఎస్-1ఎ ను బైకనూర్ కేంద్రం నుండి వొస్తోక్ రకం సోవియట్ బూస్టర్ రాకెట్ 1988 మార్చి 17న అంతరిక్షంలోకి పంపింది. దీని కక్ష్యను భారతీయులే నిర్ణయించారు. యిది భూమి వనరులను అధ్యయనం చేయగలదు.

ఎనర్జియా వ్యవస్థ, తిరిగి వుపయోగించుకోవీలున్న రోదసి షటిల్ పనిచేయడం మొదలు కావడంతో దూర రోదసిని శాంతియుత ప్రయోజనాలకోసం సోవియట్ యూనియన్ వినియోగించుకునే అవకాశాలు పెరిగాయి. అమెరికన్ రోదసిషటిల్ కన్నా అనేకరెట్లు బరువుగల షటిల్‌ను కక్ష్యలో పెట్టిన ఎనర్జియా రోదసిలోకి వస్తువులను ప్రయోగించేందుకు అయ్యే ఖర్చులను 10రెట్లు తగ్గించగలదని టైమ్స్ ఆఫ్ లండన్ అభిప్రాయపడింది. గతంలో అసాధ్యమని భావించిన ప్రాజెక్టుల అమలును యిది సాధ్యం చేస్తుంది.

## పరికల్పనలు ఆవిష్కరణలు

గ్రహాల కక్ష్యలకూ జీవశాస్త్రపరంగా క్రియాశీలమైన స్థానాల అత్యుచ్చ రేఖలకూ మధ్య గల ఉమ్మడి లక్షణమేమిటి? వాటిని మనం ఒకే భేదాత్మక సమీకరణలతో వర్ణించగలమని కనిపిస్తుంది. అనేక సూక్ష్మ ప్రపంచ క్రమాలను—కారణాలు తెలియని మానవుని మనస్సు వ్యక్తీకరణలనూ, విశ్వనిర్మాణ స్వరూపాన్నీ రెంటినీ- ఈ సమీకరణలు అనుసంధిస్తున్నాయి. సమస్త సృష్టి రహస్యాలకూ వర్తించే ఒక సార్వత్రిక నియమాన్ని మనం కనుగొనడం జరిగిందా? యిది యింకా ఒక నియమం కాదు, ఒక పరికల్పన మాత్రమే. అయితే ఈపరికల్పన ఒక అభూత ఊహాకల్పనగా మాత్రమే కనిపిస్తున్నప్పటికీ మాస్కోలోని జి.వి.ప్లెఖనోవ్ జాతీయార్థిక వ్యవస్థ అధ్యయన సంస్థ దాన్ని ప్రచురించింది. ఈ

# కొత్త సమీకరణాలు

చిత్రరచన: వి. పల్యాకవ్



సంస్థ ప్రచురణల రచయితల్లో సాధారణంగా, పరిశోధకులు, లెక్చరర్లు, విద్యార్థులు, పోస్ట్‌గ్రాడ్యుయేట్లు ఉంటారు. ఈ పరికల్పన అందరికీ ఆసక్తిదాయకంగా ఉంటుందని మేమనుకుంటున్నాము. ఎందుకంటే, యిది అందరినీ ఆకర్షించిన, అస్తిత్వ మౌలిక ప్రశ్నలకు—జీవితం, మరణం, అమరత్వం—జవాబు చెప్పే ప్రయత్నం. మా విలేకరికి ఈ పరికల్పన ప్రతిపాదకుడూ, భౌతిక శాస్త్రవేత్తా అయిన ప్రొఫెసర్ బోరిస్ ఇస్కకోవ్ యిచ్చిన యింటర్వ్యూ సంక్షిప్తపాఠమిది.

ప్రశ్న: మీ పరికల్పనకు ప్రాతిపదిక ఏమిటి?

ఇస్కకోవ్: ప్రపంచ లెప్టాన్ వాయువు గురించిన ఒక సుప్రసిద్ధ భావం నాపరికల్పనకు ప్రాతిపదిక. లెప్టాన్‌లు ఒక రకమైన మూలక ద్రవ్యకణాలు. వాటిలో ఎన్నో రకాలున్నాయి: ఎలెక్ట్రాన్లు, పాజిట్రాన్‌లు, న్యూట్రినోలు వీటిలో కొన్ని. అవి స్థలంలో చాలా తక్కువగా కేంద్రీకృతమై ఉన్నాయని శాస్త్రజ్ఞుల్లో అత్యధికుల అభిప్రాయం. వీటికి తోడు అతి తేలికైన ఈ మూలద్రవ్యకణాలు, అంటే సూక్ష్మ లెప్టాన్‌లు కూడా ఉన్నాయని కొంతమంది శాస్త్రజ్ఞుల అభిప్రాయం. యివి అన్ని భౌతిక వస్తువులలోను, శూన్యంలో సైతం విస్తార పరిమాణాలలో ఉన్నాయని వీరి ఊహ. వేరుమాటలలో చెప్పాలంటే ఈ సూక్ష్మ లెప్టాన్‌ల "వాయువు" విశ్వమంతా నిండుకొను ఉంది. కేవలం $10^{-37}$ గ్రాము సాంద్రతగల ఒక సూక్ష్మ లెప్టాన్‌ను కనుగొన్నట్టు ఇటీవల ఒక రచనలో వెలువడింది. ఇదివట్టి ఊహాకల్పనగా, విశ్వవ్యాప్త ఈథర్ గురించి భావన లాంటిదిగా తోచవచ్చు. కాని సోవియట్ పరిశోధకులు ఒఖాత్రిన్, సొచవసవ్‌లు తాము సూక్ష్మ లెప్టాన్‌లను కనుగొన్నామని గట్టిగా చెబుతున్నారు

ఘనపదార్థం చుట్టూ ఇలాంటి కణాల కేంద్రీకరణలున్నట్టు ప్రత్యేక యంత్రపరికరాల సాయంతో తీసుకున్న ఛాయా చిత్రాలు చూపుతున్నాయని వారన్నారు. అద్దుకోతలో అవి అంధకార నేపథ్యంలో. ఏక కేంద్ర కాంతి వలయాలుగా కనిపిస్తాయి.

ప్ర: ఈ వలయాలు ఎందుకు గోచరమవుతున్నాయి?

ఇస్కకోవ్: సూక్ష్మ లెప్టాన్‌లు రెండు స్థితులలో (ప్రకోపిత స్థితి, అప్రకోపిత స్థితి) ఉండగలవనేది స్పష్టమే. అప్రకోపితస్థితిలో ఈ కణాలను సాధానాల ద్వారా నమోదు చేయడం చాలాకష్టం ప్రకోపిత సూక్ష్మ లెప్టాన్‌ల సంగతి వేరు. పైప్రయోగంలో ఫోటో తీసి నది బహుశా వీటినే. కాబట్టి, సూక్ష్మ లెప్టాన్ వాయువు స్థలంలో ముద్దలు ముద్దలుగా ఉంది.

నా పరికల్పనలోని ప్రధాన భావం ఇది: మన విశ్వం యావత్తూ పరిమాణాత్మకమైనది. పరిణామాలు, ఘటనలు అంచెలంచెలుగా సంభవిస్తాయి. పదార్థం, జీవజాతుల పరిణామం, వ్యష్టి జీవితం మొదలైన వాటి సార్వత్రిక పరిమాణీకరణ మనకు కనిపిస్తుంది. ఒక స్థితి నుంచీ మరొక స్థితికి క్రమక్రమ పరివర్తన అనేది లేదు.

ప్ర: మీ పరిశోధనా పత్రంలోని సైద్ధాంతిక భాగం సూత్రాలతో నిండిఉంది. తాత్విక సమస్యలను మీరు గణిత శాస్త్ర, గణాంకశాస్త్ర పరిభాషలో చెబుతున్నారు. ఈ సమీకరణల అర్థాన్ని సర్వజన సుబోధకంగా చెప్పగలరా?

ఇస్కకోవ్: నాపత్రం శ్రోడింగర్ సమీకరణల గురించిన తాత్విక అవగాహనకు సంబంధించినది. ఈ సమీకరణలను పాఠశాలలలో కూడా నేర్పుతున్నారు. వీటిని "కర్మ సమీకరణలు" అని నేను పిలుస్తాను. ఇది సాహసమే. ఇక్కడ నా అర్థం "కర్మఫలం" లేదా "విధి" అనే భావనకాదు. విశ్వంలోని అసంఖ్యాక పరిణామాలు పరస్పర ఆధార ఆధేయాలని నా భావం. "కర్మ సమీకరణల" పరికల్పనాత్మక రంగంలో, అనంత శక్తి సమాచార రంగంలో కార్య కారణ సంబంధాలను వివరించ వీలవుతుంది. ఈ సంబంధాల సాంద్రీకృత మండలాలు భౌతిక ప్రపంచంలోని వస్తువులకూ, అత్యంత విరళీకృత మండలాలు భౌతిక శూన్యానికీ, అనురూపం మైనవని మనమెందుకు అనుకోకూడదు?. అప్పుడు ప్రతి ఒక్క ఘటన అసంఖ్యాక ఫలితాలకు దారి తీస్తుందనీ, ప్రతిఫలితం అసంఖ్యాక కారణాలవల్ల సంభవిస్తుందనీ మనం నిర్ధారణ చేయగలం. ఎంతటి మేధావైనా ఈ సంబంధాలలో అత్యల్ప భాగాన్ని సైతం తెలుసుకోలేడు. ఇందువల్ల, సర్వమూ ముందుగానే నిర్ణయమైపోయిందని, లేదా విధికృతమని ఒక నమ్మకంఏర్పడింది. ఘటనలను ముందుగానే, దూరదృష్టితో ఊహించి, ఒకలక్ష్య శుద్ధితో వాటిని ప్రభావితం చేయటానికీ, కొన్ని సందర్భాలలో ఆ ఘటనలను ప్రేరేపించడానికీ మానవునికి గల శక్తికి సరియైన భౌతిక కారణం కనుగొనడం యిప్పుడు సాధ్యమని తోస్తుంది.

ప్ర: ఇదేమిటో అర్థంకావడం లేదు. గణిత, గణాంక, భౌతిక శాస్త్రాలకూ, భవిష్యత్తును చెప్పగల మానవునిశక్తికీ మధ్య సంబంధ మేమిటి?

ఇస్కకోవ్: నా పరికల్పనకు లెప్టాన్ - ఎలెక్ట్రాన్ - మాగ్నెటిక్ (**లెమ్**) పరికల్పన అనిపేరు. అది క్వాంటమ్-స్టాటిస్టికల్ బయోఎనర్గో ఇన్‌ఫర్మాటిక్ కు (పరిమాణ-గణాంక శాస్త్రీయ జీవశక్తి సమాచారశాస్త్రం—అను) సంబంధించినది.

"కర్మ సమీకరణల" వల్ల సంకేతాలు పరిమాణాత్మకంగా కాలము, స్థలములో చీలుతాయన్న సువిదిత భావనలను సామాన్యీకరించవచ్చు. అవి పూర్వ సంకేతాలుగానూ, ఉత్తర సంకేతాలుగానూ చీలుతాయి. ఉదాహరణకు, పూర్వసంకేతాలను మామూలు భాషలోకి అనువదించడం ద్వారా ప్రధాన సంకేతం రాకముందే ఏఘటననైనా మనం తెలుసుకోవచ్చు. ఉత్తర సంకేతాలను అలా అనువదించడంద్వారా, గతకాల ఘటనను చిత్రించవచ్చు. వేరు మాటల్లో చెప్పాలంటే కొందరికి ఒక ఘటనను గురించిన ముందు హెచ్చరికలు చాలా మందికన్నా ఎందుకు అనుభూతమవుతాయో శాస్త్రీయంగా వివరించవచ్చునన్న మాట.

ఇందులో అలౌకికమైనదేదీ లేదు. రేడియో ఇంజనీరింగ్ నుండీ ఒక ఉదాహరణ ఇస్తాను. ఒక సొలిటన్ (ఒకే తరంగ సముదాయం) స్థలంలో విస్తరించి పూర్వసంకేతాల పరంపరగానూ, ఉత్తర సంకేతాల పరంపరగానూ చీలుతుంది. మొదటిది ప్రధాన సంకేతానికి ముందురాగా, రెండవది తర్వాతవస్తుంది. స్థల, కాలాల్లో అవి





వ్యాపించిన కొద్దీ, స్వతంత్ర అస్థి త్వాంశాలవుతాయి. ప్రధాన సంకేతంలా ఒకే సమాచారానికి వాహిక లైనప్పటికీ, వాటికిగల శక్తి బహు తక్కువ. పూర్వ సంకేతాలను గ్రహించడంద్వారా అసలు సంకేతం మోసుకొస్తున్న ఘటనను గురించిన సమాచారాన్ని ముందుగానే తెలుసుకోవచ్చు. అదేవిధంగా ఉత్తర సంకేతాలను విడమర్చి చూడటం ద్వారా గతకాల సమాచారాన్ని తెలుసుకోవచ్చు. అతిసున్నితమైన యంత్రాలకుగల శక్తి కొంత మంది వ్యక్తులకు కూడా ఉంది. యితరులకు జరుగనున్నది ఈ స్పందన శక్తిగల వారికి అంతకు ముందే జరిగిపోయిందన్నమాట వారికి పూర్వ సంకేతాలు అనుభూతమయ్యాయన్న మాట

ప్ర: అటువంటి ప్రయోగాలను గురించి చాలా విన్నాను. కానీ గతాన్నీ, భావినీ గురించిన ఈ జ్ఞానం వాస్తవమని నేను నమ్మలేక ,,పోతున్నాను.

ఇస్కకోవ్: సోవియట్ శాస్త్రజ్ఞుడు చిజేవ్‌స్కీ రచనలే దీనికి సమాధానం. వాటిని శాస్త్రజ్ఞులంతా గుర్తిస్తున్నారు. అవి పూర్వ సంకేతాలను గురించి చెబుతున్నాయి. సూర్యుని కార్యకలాపాలు తీవ్రంగా ప్రకోపించినప్పుడు, ఈ ఘటన ప్రధాన సంకేతమైన సౌరమారుతం భూమిని చేరుకోవడానికి రెండు మూడు రోజులు పడుతుంది. ఈలోగా పూర్వసంకేతాలు న్యూట్రినో, ఫోటాన్‌ల రూపంలో ప్రసరించి ఎనిమిది నిమిషాల్లో భూమికి అందుతాయి. వాటిన్ని మనం విడమర్చి తెలుసుకోగలిగితే ప్రధాన సంకేత ఆగమనానికి మనం సన్నద్ధమై ఉండగలం. అది సృష్టించే భౌగోళిక-అయస్కాంత తుఫానులు గుండె జబ్బులు, మొదలైన వ్యాధులను వ్యాపింప జేస్తాయి మరణాలను పెంచుతాయి. కాబట్టి, మనం అన్ని దేశాలలోని వైద్య శాఖలకు హెచ్చరిక చేయగలమనేది నిజమే. ఈ పూర్వ సంకేతాలను యంత్ర సాధనాలు గ్రహించడమే కాదు, కొంత మంది వ్యక్తులు కూడా వాతావరణంలోని మార్పులను రెండు, మూడు రోజులు ముందుగానే పసికట్టగలరు.

ప్ర: కొందరు కొన్ని సంవత్సరాల తరువాత జరుగ బొయ్యే ఘటనను కలగంటారు. అంతటి దూరదృష్టి శాస్త్రజ్ఞులకు అసాధ్య మని అనుకొంటాను.

ఇస్కకోవ్: ఇందులో కూడా నిగూఢమైనదేదీ ఉందని అనుకోను. కొన్నేళ్ళలో జరుగనున్న ఘటనను ముందుగా తెలుసుకోవడం సాధ్యమని నా అభిప్రాయం. సంయుక్త 'కర్మ సమీకరణ' విపర్యస్త సంకేతాలన్న వాటిని చూపుతుంది. ఇవి కాలస్రవంతిలో భవిష్యత్తు నుంచీ వర్తమానం గుండా గతంలోకి ప్రవహిస్తుంటాయి. వీటిని వ్యక్తులు గానీ, యంత్ర పరికరాలుగానీ గ్రహించగలిగితే, భవిష్యత్తును గురించిన సమాచారం లభిస్తుంది. కొందరు సోవియట్, విదేశీ వ్యక్తులతో జరిపిన ప్రయోగాలను బట్టి చూస్తే వారు దూర భవిష్యత్తులోని ఘటనలను సరిగానే ఊహించి చెప్పినట్టు కనిపిస్తుంది. అయితే, ఈ ప్రయోగాల నిజానిజాలను జాగ్రత్తగా రూఢీ పరచుకోవలసి ఉంటుంది.

ప్ర: తమ శాస్త్రీయ ప్రతిష్ఠను

విలువైనదిగా పరిగణించే పరిశోధకులు అటువంటి ప్రయోగాలను పట్టించుకుంటారా? కాలం గురించిన అటువంటి ప్రయోగాలు కార్యకారణ మౌలిక సూత్రాన్ని తల్లకిందులు చేస్తుందన్న అభిప్రాయం ఒకటుంది.

**ఇన్యకోవ్:** దూరంగా ఎక్కడో జరిగిన ఘటనలను ముందే తెలునుకునేందుకు పూర్వ సంకేతాలు వీలు కలిగిస్తున్నప్పుడు, విపర్యస్త సంకేతాలు ఇంకా సంభవించని ఘటనలను గురించిన సమాచారాన్ని తెలియచేయగలవు.

**ప్ర:** మీరు లోకాతీతశక్తిపై నమ్మకానికి ఒక సాంకేతిక ప్రాతిపదికను, గణితశాస్త్ర సమీకరణల ద్వారా కల్పించజూస్తున్నారని ఇలాంటివాటిపై నమ్మకం లేని పాఠకుడంటాడేమో?

**ఇన్యకోవ్:** దీనికీ లోకాతీత శక్తికీ ఎలాంటి సంబంధంలేదు. మనం భౌతిక క్రమాలను గురించి చర్చిస్తున్నాం. భవిష్యత్తును గురించి తెలునుకోగల సామర్థ్యాన్ని శాస్త్రీయ దూరదృష్టి అని, లేక అంతశ్చేతన స్థాయిలోని సహజాత దూరదృష్టి అని అంటున్నాం. శాస్త్రీయ దూరదృష్టిగల పరిశోధకుణ్ణి మార్మికుడని అనగలమా?

**ప్ర:** అంతగా పరిశీలింపబడని మానవ మనస్తత్వ వ్యక్తీకరణలను గురించి మరింత ప్రయోజనాత్మకంగా పరిశోధనలు జరపడానికి **లెమ్** పరికల్పన తోడ్పడుతుందా?

**ఇన్యకోవ్:** అటువంటి పరిశోధనలు జరుగుతున్నాయి. ఉదాహరణకు, మానవ శరీరంలోని చక్రాల-శక్తికేంద్రాల—సంఖ్యను బట్టి ఏమేరకు డోలనల ప్రతిధ్వనులీనుతుంటాయో ప్రొఫెసర్లు చెర్‌నెత్‌స్కీ, మెదెల్యానోవ్‌స్కీలు పరీక్షించి చూచారు. ప్రాచ్యవైద్య శాస్త్రాన్ని బట్టి ఈ క్రియాశీల ఉచ్చస్థాయి బిందువులు ఒకదానికొకటి అడ్డంగా వెడుతుంటాయి. ఈ ప్రయోగాల కాలంలో ఒక జనరేటర్ విద్యుదయస్కాంత తరంగాలను వ్యాపింపజేయగా, ఆ వ్యక్తులు తమ అనుభూతిని తెలిపారు. ఈ డోలన ఆవృత్తులు ఈ చక్రాలలో ఒకదానికి లెక్కగట్టిన సంఖ్యతో ఏకీభవించినప్పుడు ఈ చక్రమున్న దనుకున్న స్థానంలో ఆవ్యక్తికిచాలా అసాధారణమైన సంవేదన అనుభూతమైంది. చక్ర పరిమాణపు సంఖ్యపై డోలనల శక్తి ఆధారపడి ఉందన్న **లెమ్** అంచనాను ఈ ప్రయోగాలు ధ్రువపరుస్తున్నట్టు కనిపిస్తుంది. దీన్ని బట్టి ఇప్పుడే తుది నిర్ణయాలు చేయలేము. ప్రయోగాలింకా జరుగుతున్నాయి. **లెమ్** పరికల్పనలోని ఇతర విషయాలను గురించి మరింత కచ్చితంగా చెప్పవచ్చు. భారీ వస్తువుల కొనదేలిన అంచులకు ఎదురుగా ఉన్న క్షేత్రాలలో మార్పులు వస్తాయని, పదార్థం లెప్టాన్‌ల రూపంలో ప్రసరించగలదని కొన్ని లెక్కలు నిరూపించాయి. వీటిని **1984** లో శాస్త్రీయ పత్రికలు ధ్రువపర్చాయి. భూగర్భపు పగుళ్ళ మండలంలో ఎలెక్ట్రాన్‌ల ప్రసరణ ఉన్నట్టు కనుగొన్నారు. ఇంద్రియ స్పందనగల వ్యక్తుల కళ్ళకు గంతలు కట్టి వారిని కొనదేలిన వస్తువుల వద్ద వుంచితే, కొనదేలిన వస్తువులేవో తమపైకి ఎక్కుపెట్టబడి వున్నట్టు వారు చెప్పగలరు.

**ప్ర:** మీ పరికల్పనను ధ్రువపరచే యితర సాక్ష్యాధారా లేమైనా ఉన్నాయా?

**ఇన్యకోవ్:** చిత్రలేఖనంలో ఆసక్తిదాయకమైన అనేక, విషయాలు నాకు కనిపించాయి. అన్ని వస్తువులూ పాదార్థిక పరిమావు పొరలతో కప్పబడి ఉన్నాయని కర్మ సమీకరణలు సూచిస్తున్నాయి. ఉదాహరణకు, మానవుడు సాంప్రదాయక అర్థంలో ఒక శరీరంగాను, దాని చుట్టూ అగోచరమైన సూక్ష్మ లెప్టాన్‌ల పొరలు అనేకం ఆ శరీరాన్ని పరివేష్టించి ఉన్నట్లుగాను ఊహించవచ్చు. మానవ శరీరాన్ని కప్పిన ఈ పొరలకూ, శరీరానికీ మధ్యదూరాన్ని కర్మ సమీకరణల వల్ల లెక్కగట్టగల వీలుంది. ఇది తెలిస్తే ప్రాచీన

రూపచిత్రాలలోని మహనీయుల తల చుట్టూ ఉన్న తేజోమండలానికి అర్థమేమిటి అనే ప్రశ్నకు సమాధానం చెప్పడం కష్టం కాదు. ఈ తేజోమండలం భౌతికమైనదా లేక చిత్రకారుని ఊహా కల్పనా? ఇవి సూక్ష్మ లెప్టాన్లతో ఏర్పడిన వలయాకారపు పొరలని నా అభిప్రాయం. వాటి పరిమాణాన్ని అంచనా వేసి ఒక పటంపై గీయడం సులభమే.

ప్ర: కానీ, అవి కనిపించవని మీరే అన్నారు. ప్రాచీనకాల శిల్పులు చిత్రకారులు వాటినెలా చూడగలిగారు?

ఇస్కకోవ్: అత్యంత సృజనశీలురైన వ్యక్తులు—ఎంతో ఇంద్రియ స్పందన జ్ఞానం కలవ్యక్తులు బహుశా, వాటిని చూచి ఉండవచ్చు. ఏదేమైనా, మామూలు ఇంద్రియ జ్ఞానంకల వ్యక్తి ఇతరుల భౌతిక క్షేత్రాలను తెలుసుకోవడం లేదా? తల్లి, ఆమె పసిపాప ఒకరి పరిస్థితిని ఒకరు ఎలా తెలుసుకుంటారో జ్ఞాపకం చేసుకోండి. పసిపాప నిద్రలేచి మంచం నుంచీ పడిపోనున్నప్పుడు ఆవిషయం చూడకపోయినా, తల్లి కేక వేస్తుంది. దీనికి కారణమేమి? తల్లీ, పిల్లలకు ఉమ్మడిగా సూక్ష్మ లెప్టాన్ పొరలుండవచ్చు యివి సమాచారాన్ని అందజేసే ఆస్కారం లేక పోలేదు. ఏక మనస్కులైన వ్యక్తుల బృందంలో కూడా ఇది కనిపిస్తుంది. ఒక సంయుక్త పథకంలో నిమగ్నులైనవారు మాట్లాడకుండానే ఒకరి నొకరు అర్థం చేసుకుంటారు. వారిలో కొందరికి ఏక కాలంలో ఒకే భావాలు తడుతుంటాయి. వారు సహజాత జ్ఞానంతో సమాచారాన్ని పరస్పరం తెలుపుకుంటారని కనిపిస్తుంది. దీనికి కారణమేమి? ఏకమనస్కులైన వ్యక్తులకు కూడా ఉమ్మడి పరిమాణపు బయటి పొరలు ఉంటాయనుకుంటాను. వెర్నాద్‌స్కీ ప్రతిపాదించిన "మానవాళి సమిష్టి మానసిక రంగాన్ని" గుర్తు చేసుకోండి. దీన్ని ఒక ప్రత్యేక అభివర్గంగా పరిగణించవచ్చు. ఈ రంగంలో, తక్కిన వాటితోపాటు సమస్త మానవాళి ఆలోచనల, హృదయానుభూతుల ఏకీకృత క్షేత్రం కూడా ఉంది. ఈ రంగం భూమండల సమీపరోదసి అంతటా పరచుకొని ఉంది మన గృహాన్ని సంపూర్ణంగా ఇది కప్పివున్నట్టు తోస్తుంది.

ప్ర: మీ భావాలు సాహసోపేమైనవనే సంగతిని కాదనలేను. మీ పరికల్పన ప్రకారమే అవి యితరులకు కూడా తట్టి ఉండాలి కదా. కానీ, అటువంటి వారున్నట్టు మనకు తెలీదు.

ఇస్కకోవ్: ప్రపంచ లెప్టాన్ భావం పరిపక్వం కావడానికి శతాబ్దాలు పట్టింది. మెండలెయేవ్ ఈథర్ అనే అణువులున్నట్టు భావించారు. 20 ఏళ్ళక్రితం అమెరికన్ భౌతిక శాస్త్రవేత్త రెడెర్ఫర్ హిప్నాసిస్, టెలిపతీ వంటి మానసిక పద్ధతుల్లో న్యూట్రినోలు సమాచారాన్ని తీసుక వెడతాయని ఊహించారు. అనేకరకాల లెప్టాన్ కణాలు ఈ పాత్ర వహిస్తాయని ఇప్పుడు సోవియట్ పరిశోధకులంటున్నారు.

ప్ర: ఆలోచనలు, హృదయాను భూతులు భౌతికమైనవనీ, వాటిని రేడియోద్వారా లాగానే, ప్రపంచంలో ఎక్కడికైనా పంపవచ్చుననే శాస్త్రజ్ఞులతో మీరు ఏకీభవిస్తున్నారన్న మాట.

ఇస్కకోవ్: వాటిని తూచవచ్చుకూడా. లెమ్ పరికల్పన ప్రకారం, ఒక మనిషి భావాలు, సంవేదనలు భౌతికమైనవి. వాటి సాంద్రత $10^{-39}$ గ్రాము మొదలు కొని $10^{-30}$ వరకూ ఉంటుంది. అక్షరాలా తేలికైన, బరువైన భావాలూ, హృదయానుభూతులూ, ఉన్నాయి. ఇతర శాస్త్రజ్ఞులు కొందరికి ఇదే అభిప్రాయం ఉంది. ఉదాహరణకు, త్సియొల్‌కోవ్‌స్కీ విరళీకృత పదార్థ శరీరులైన వివేచనా జ్ఞాన జీవులున్నట్లు నమ్మారు. మామూలు వ్యక్తి తన సమాచార శక్తి తాలూకు ప్రతిమూర్తిని సృష్టించగలడని, ఈ ప్రతిమూర్తి అతి తేలికైన లెప్టాన్ సూక్ష్మ కణాలతో ఏర్పడినదని త్సియొల్‌కోవ్‌స్కీ భావాలు గలవారు గట్టిగా చెబుతున్నారు. దూరప్రాంతాలకు ఈ అదృశ్య ప్రతిమూర్తిని పంపడం ద్వారా ఒక వ్యక్తి వేల కిలోమీటర్ల దూరంలోని సంగతులను తెలుసుకో గలడని వీరంటున్నారు.

లెప్టాన్ ప్రతిమూర్తి విరళీకృత పదార్థ శరీరియైన వివేచనాజ్ఞాన జీవి వంటిది.

ప్ర: కొన్ని సందర్భాలలో మానవుడు ఒక విధమైన సమాచార ప్రతిమూర్తిని సృష్టించి దాన్ని ప్రాదేశికంగానూ, కాల స్రవంతిలోనూ సుదూర ప్రయాణాలపై పంపవచ్చునని మీ అభిప్రాయం. అట్లయితే, అతను ఇంట్లో కూర్చుని

విశ్వంలోని ఏ ప్రాంతపు భూత, వర్తమాన, భవిష్యత్తులనైనా తెలుసుకోగలడు కదా?

ఇస్కకోవ్: నిజమే. అటువంటివి నిజమని నమ్మటం కష్టమే. కానీ, మన అంతర్భూత జ్ఞానానికి కారణమేమని చెప్పగలం? ప్రాచీన ఈజిప్షియన్లు భూమి గుండ్రంగా ఉందని, అది సూర్యుని చుట్టూ తిరుగుతున్నదని చెప్పారు. అంగారక గ్రహానికి రెండు ఉపగ్రహాలున్నట్టు జొనాతన్ స్విఫ్ట్ రాశారు. ఇలాంటివి ఇంకా కొన్ని ఉదాహరణలివ్వచ్చు. ఇటీవలే ఇవి అన్నీ ధ్రువపడ్డాయి. మన ప్రాచీనులకు టెలిస్కోపులూ, రాకెట్లూ, సాపేక్ష సిద్ధాంతం లేవు కదా? సాంస్కృతిక అవశేషాలను బట్టి చూస్తే, ప్రపంచాన్ని గురించి అంతర్ జ్ఞానంతో తెలుసుకోవడం, ప్రాచీనుల్లో బాగా పెంపొందింది. ప్రాచీన భావాలూ, హృదయోద్వేగాలూ గాలిలో తిరుగాడుతున్నట్టు గ్రీకు తత్వవేత్తలు చెప్పారు. వీటిని వాళ్లు "ఈడోస్" ప్రతిబింబాలని అన్నారు. లెమ్ పరికల్పన ప్రకారం ఏకమనస్కులైన వ్యక్తులు ఒకే విధంగా ఆలోచించడం ద్వారా సూక్ష్మ లెప్టాన్‌లనుంచీ శక్తివంతమైన సమిష్టి భావ ప్రతిబింబాలను సృష్టిస్తారు. అవి ఒకదానినొకటి ప్రభావితం చేయనారంభిస్తాయి.

ప్ర: మీరు మత పరిభాషను వాడకుండా, శాస్త్రీయ పరిభాషను వాడుతున్నప్పటికీ, ఆత్మ 'అనేది ఉందని చెబుతున్నట్టు తోస్తున్నది.

ఇస్కకోవ్: నేను మార్మికవాదినికాను, భౌతిక వాద శాస్త్రవేత్తను. ప్రయోగ ఫలితంగా రూఢియైన వాస్తవాలను విశ్లేషిస్తాను. శాస్త్రీయ భావనలను దాటిపోవడం లేదు. లెమ్ పరికల్పనలో భావాలకూ, ఉద్వేగాలకూ భౌతిక అస్తిత్వం ఉండవచ్చుననేది గర్భితం. అందువల్ల భౌతికప్రపంచానికీ, భావ ప్రపంచానికీ మధ్య సంబంధం గురించిన ప్రశ్న కొత్త పద్ధతిలో ముందుకు వస్తున్నది.

దీన్నిబట్టి, దైవం గురించిన భావనకు భౌతిక వ్యాఖ్య ఇవ్వవచ్చు. అసంఖ్యాక ఆస్తిక జనసందోహాల నుంచీ ఒకే విధమైన భావాలు, ఉద్వేగాలు వెలువడు తుంటాయి. యివన్నీ సూక్ష్మ లెప్టాన్‌లనుండీ ఏర్పడిన శక్తివంతమైన సమష్టి ఆరాధ్య మూర్తిగా భౌతిక రూపందాల్చు తాయి. ప్రతి ఆస్తికుడూ ఈ మూర్తినే దైవంగా చూస్తాడు. కాబట్టి, ఈ లెమ్ పరికల్పన ఫాయెర్‌బాక్ సూత్రీకరణతో ఏకీవిస్తోంది. అదేమిటంటే, మనిషిని సృష్టించింది దేవుడు కాదు. మనిషే తానున్న రూపంలో దేవుణ్ణి సృష్టించాడు.

ప్ర: మీ పరికల్పన బహువింతైనది. దానికి నిజమైన శాస్త్రీయ పరిశోధనల ఆధారముంటే బాగుంటుంది.

ఇస్కకోవ్: ప్రయోగాల ద్వారా దీన్ని దర్యాప్తు చేయవలసిన అవసరం ఉంది. మరో ఉదాహరణ ఇస్తాను. 1984 లో ఒక రౌండ్ టేబుల్ చర్చలో అనేకమంది ప్రేక్షకుల ముందు ఒక ప్రయోగం జరిగింది. వ్లాదివొస్తోక్‌లో నిద్రిస్తున్న ఒక వ్యక్తిని ప్రత్యేక ఇంద్రియ స్పందనజ్ఞానంగల ఏడుగురు మాస్కోలో వుండి రోగనిదానం చేశారు. ఆవ్యక్తిని స్వయంగా పరీక్షించిన వైద్యుని నిర్ధారణలూ, ఈ ఏడుగురు, ఎవరికి వారు చేసిన నిర్ధారణలూ ఏకీభవిస్తున్నాయని తేలింది. పోతే, ఈ ఏడుగురి నిర్ధారణలే మరింత సవివరంగా ఉన్నాయి. అంత దూరాన ఉండినప్పటికీ, వీరు తమ సూక్ష్మ లెప్టాన్ ప్రతి మూర్తులద్వారా ఆరోగి చైతన్యం నుంచీనే కాకుండా, అతని అంతశ్చైతన్యం నుంచీ కూడా గతం నాటి విస్మృత వాస్తవాలను గురించిన సమాచారం సేకరించగలిగారు.

కాబట్టి, ఇంటిలోనే ఉండి మన ఉపగ్రహంలోని ఏభాగానికైనా వెళ్ళి అక్కడి భూత, భవిష్యత్, వర్తమానాలను తెలుసుకునే అవకాశముంది. ఈ ఊహే నిజమైతే ప్రజల మధ్యా, రాజ్యాల మధ్యా సంబంధాలు ఎలా మారబోతాయో ఊహించడం సైతం కష్టం.

(మ్యాగజైన్ ప్రిరోడా ఇ చెలొవేక్)

# మానవ విలువలు



## కళాకారుల కర్తవ్యం

కుడ్య కాన్వాస్ వర్ణచిత్ర కారుడు, సోవియట్ చిత్ర కారుల బోర్డు అధ్యక్షుడు అయిన ఆంద్రీ వాస్నెత్సోవ్‌తో ఇంటర్వ్యూ

ప్ర: ప్రపంచంలో కళాకారుడి స్థానం ఏమిటి? కళలో జర్నలిజం వుండడాన్ని మీరు వ్యతిరేకిస్తున్నారా?

జ: నాకు జర్నలిజంలో ఆసక్తి ఉన్నప్పటికీ, సమాచార బహుళప్రసార సాధనాలు నేటి అతి తీవ్ర సమస్యలను అందరి దృష్టికి తెస్తాయని నేను అంగీకరిస్తున్నప్పటికీ, పోస్టర్లు, వ్యంగ్య చిత్రాల్లో తప్ప లలిత కళల్లో జర్నలిజం శైలి మంచిదని నేననుకోవడం లేదు. కళాకారుడు పాత్రికేయుడిలా తత్కాలిక సమస్యలను గురించి చెప్పలేడు. నేను అలాంటి ప్రయత్నమెన్నడూ చేయలేదు.




ప్ర: కానీ, 1950ల చరమార్ధంలోను, 1960 ల ప్రథమార్ధంలోను మీరు వేసిన చిత్రాలను (ఉదాహరణకు, ఒక్క బ్రెడ్ ముక్క తప్పమరేమీలేని టేబుల్ ముందు ఒకవ్యక్తి కూచున్నట్టు చిత్రించిన "బ్రేక్‌ఫాస్ట్" అన్న చిత్రం) నిశిత సామాజిక విమర్శ గల రాజకీయ చిత్రాలుగా పరిగణిస్తున్నారు.

జ: మీరునమ్మండి, నమ్మకపొండి నాకెలాంటి రాజకీయ ఉద్దేశాలూ లేవు. అతి మామూలు వస్తువుల నిశ్చల జీవిత చిత్రాలను వేయాలనుకున్నానంతే. నాపై ఆనాటి కాల ప్రభావం ఉందని వేరే చెప్పనవసరం లేదు. అయితే, అది కేవలం అంతర్ దృష్టి ఫలితం మాత్రమే. మనదేశ పరిస్థితిని నా చిత్రాల్లో చూపాలని నేనెప్పుడూ ప్రయత్నించ లేదు.

ప్ర: అయితే, మీరు యుద్ధానంతర కాలంలో మూసపోత ధోరణిని వదిలించుకో ప్రయత్నించలేదా?

జ: అడ్డం వస్తూండిన పిడిసూత్రాలను వదిలించుకో ప్రయత్నించాను. నేను వాస్తవిక వాదిగా ఉండాలని అనుకున్నాను.

సంచలనాత్మకమైన దేన్నీ నేనెన్నడూ కల్పించ లేదు; ప్రత్యేకించి నా తొలిచిత్రాల్లో తీవ్ర ఇతివృత్తాలను యెంచుకోలేదు. కేవలం నా ఆలోచనలనూ, అనుభూతులనూ వ్యక్తపరిచానంతే. ఇది కళాకారుడికి చాలా కష్టమైన కార్యం. నేను ఏదో ఒక కొనకు లాగే గ్రూపులకు - అటు అతివాదుల, యిటు మితవాదుల, లేదా ఏ యితర గ్రూపులకు కానీ చెందను. నాకు మంచి గురువులు (గొంచరోవ్, దీనెకాలు) లభించారు. ఫావోర్‌స్కీ నా ఉపాధ్యాయుడు కాకపోయినా, నాకు ఆయన బృందంతో సంబంధం ఉండింది.

ప్ర: మీరు ఆకాలాన్నీ దాని సృజనాత్మక వాతావరణాన్నీ తలచుకొని, యిప్పుడవి లేవని చింతిస్తున్నారా?

జ: కొంత వరకు. 1950 ల నాటి యువ చిత్రకారులు సత్యావిష్కరణకు ప్రయత్నించారనుకుంటున్నాను. మేము భిన్న బాణీలకు చెందిన వారమైనా మేము అబద్ధాలు చెప్పలేదు. నేడు సత్యానికి అంత ప్రాముఖ్యం లేక పోయినా, దానికి జనాదరణ అంతగా లేకపోయినా, అది కళకు ముఖ్యమైనది. నేడంతా వింతైన వాటిని సృష్టించి ప్రజల దృష్టిని ఆకర్షించడానికి ప్రయత్నిస్తున్నారు

మనమంతా అంటే కళాకారులూ, కళాభిమానులూ కూడ కళ్లు తెరవాలి. మనం మనచుట్టూ ఉన్న పెక్కింటిని గమనించలేక పోవడం వల్ల మనజీవితాన్ని రసహీనం చేసుకుంటున్నాము.

ప్ర: కాబట్టి, మీరు కళాకారుడికి మాత్రమే అర్థమయ్యే కొన్ని నిర్దిష్ట సాంస్కృతిక విలువలను గురించి చెబుతున్నారన్నమాట. అంతేనా?

జ: అంతే. ప్రకృతిపట్ల మన ప్రతి స్పందననే తీసుకోండి. దాన్ని ప్రతిమూర్తిని కళాకారుడు మాత్రమే సృష్టించగలడు. వర్ణచిత్రాలు, ప్రకృతితో మన సంబంధాన్ని తెలుపుతాయని అనుకుంటున్నాను. వెనుకటి గొప్పచిత్రకారుల కళాఖండాలు శాశ్వతమయినవని, వాటిని చూస్తేనే మనకు తోస్తుంది. ఆదిలో మనిషికి రూపాన్ని సర్వతోముఖంగా దర్శించగల శక్తి ఉండింది. పిల్లలకు కూడా యిది ఉంది. అయితే వారది కాలగతితో కోల్పోతారు.

ప్ర: మన నాగరికతా దశలో దాన్ని పునరుద్ధరించగలమా? కనీసం ఆ ఆశ అయినా ఉందా?

జ: చెప్పడం కష్టం. మనం మనగలగాలంటే ఈ దృష్టి అవసరమనుకుంటున్నాను.

ప్ర: ఆధునిక చిత్రకళలోని ప్రధాన సమస్య ఏమిటి?

జ: ఆదర్శవాదం అంతరించి పోవడం. సాంస్కృతిక రంగంలో వినియోగ దారీతత్వం.




సంస్కృతి, కళ- ఇవి ఆత్మిక విషయాలు. ప్రపంచమంతటా వినియోగదారీ తత్వం వీటిని దెబ్బతీసింది. ఇది పరిసర వాతావర ణాన్ని క్రమంగా నాశనం చేసింది. సంస్కృతి నీ, కళనూ వినియోగదారీ వస్తువులుగా మార్చే ఆచారం సంక్షోభానికి దారి తీయవచ్చు. మానవ జాతి సాంస్కృతిక సూత్రాలను నాశనం చేయవచ్చు

సంస్కృతికి తోడ్పాటు అవసరం. ప్రభుత్వ ఫర్మానాల వల్ల సంస్కృతి చాలా నష్టపో యిందని నేననుకుంటున్నాను. ఇతర రకాల ఫర్మానాలు కూడా ఉన్నాయి. ఉదాహరణకు, ఫ్యాషన్, లేదా మార్కెట్ కూడ ఫర్మానాలు జారీచేసేవే. అవి, మిగిలి ఉన్న సత్సాంప్రదా యాలను హరించివేసి తిరిగి తల యెత్త కుండా చేయవచ్చు. చిత్రకారునికి, అతని కళాఖండానికి ప్రభుత్వమూ, వ్యక్తులూ డబ్బు చెల్లించ వలసిందేనని వేరే చెప్పవనిలేదు. ఇది వ్యాపారం కాదు. కళా రంగంలో వ్యాపార మంటే ఒక కళకు, దాని నాణ్యతతో ప్రమేయం లేని విలువను ఆపాదించే ప్రయత్నాలని నా అభిప్రాయం. వ్యాపారం తిమ్మిని బమ్మిగా చేయవచ్చు బమ్మిని తిమ్మిగా చేయవచ్చు.

ప్ర: కళాకారుని లక్ష్యాలేమిటి?

జ: మొదటిది, మన లక్ష్యాల విషయంలో ఏకాభిప్రాయానికి వచ్చేందుకు ప్రయత్నించడం అవసరం. "వాస్తవికత" అనే మాటను అట్టి పెట్టుకో దలచాను. కళలో సత్యం, వాస్తవికత — ఇవి. రసాభిజ్ఞతా విశేషాలూకాదు, శైలికి సంబంధించిన పిడిసూత్రాలూ కాదు. వాస్తవి కత అనేది, ఒక ప్రపంచ దృక్పథం. వాస్తవి కతకు స్వాభావికవాదం విరుద్ధమైనది. ఈవాదం కూడా ఒక తాత్వికతే. అయితే, అది బూటక మైనది, భ్రమ జనిత మైనది, అసమగ్రమైనది. నీతి బాహ్యతను, హింసా రాధనను, ఆత్మిక విలువల విధ్వంసనను మనం ఎదుర్కొని పోరాడాలి.

రెండవది, పోటీ అనేది ఉండాలి. మన చిత్ర ప్రదర్శనలో ఒకతీరూ, తెన్నూ లేదు. మనం ప్రత్యామ్నాయ ప్రదర్శనలను నిర్వహి స్తూనే వుండాలి. చిత్రకారులు గట్టిగా నిలదొ క్కుకో లేరనే భయంతో మనమిలా చేయడం లేదు. వివిధ చిత్ర కారుల, వివిధ బాణీల చిత్రాల ప్రదర్శనను ఏర్పాటు చేస్తే వారు మరింత గట్టిగా నిలదొక్కుకుంటారు. ఈ చిత్రా లను వేరుపరచి, తమ అర్థమేమిటో చూపే అవకాశం వారికివ్వాలి. ఇది యువ కళాకారుల చిత్రలేఖనకు ప్రత్యేకించి వర్తిస్తుంది. ఇందులో వైయక్తికమైన దేమీ లేదని అను కోవడం తప్పు. యువకళాకారులు ఎంచు కొనే బాణీలు అనేకానేకం ఉన్నాయి. ఇక, కళావిమర్శను గురించి కొన్ని మాటలు చెబు తాను. విమర్శకుడు తప్ప మరెవ్వరూ మన కళాఖండాల మంచి చెడ్డలను అంచనా వేయలేడు. సోవియట్ చిత్రకళను గురించిన వాస్తవ చరిత్ర మన కవసరం. కానీ, నేడున్నది 1920-1930 ల నాటి కట్టుకథలే. చాలామంది చిత్రకారుల పేర్లను కూడా మర్చిపోయాం. పరస్పర అసహనం తిరిగి తలయెత్తడం గురించి కూడా నేను ఆందోళన చెందుతున్నాను. ఈ విషయం యిదివరకే పేర్కొన్నాను. కాలంమించి పోకముందే దీన్ని ఆపకపోతే కళావృక్షం మోడువారి పోతుంది.

అయినా, నేను ఆశావాదిని. జీవితాన్ని మనం ఉన్నదున్నట్టు చూడవలసిందే. కానీ, ఆదర్శవాదాన్ని ఎప్పుడూ వదలుకోరాదు. ఎందువల్లనంటే, మన చరిత్రలోని అతిక్లిష్ట సమయాల్లో అది మనకు ఉపకరించింది.

# పెరిస్త్రోయికా, ఇస్లాం మతము

బాకూ (అజర్ బైజాన్) లోగల
తజా-పీర్ షియైత్ మసీదు



సోవియట్ యూనియన్‌లో ఇస్లాం మతం రెండవ స్థానంలో ఉంది. మొదటి స్థానం రష్యన్ ఆర్థొడాక్స్ చర్చిది. అందువల్ల, ఇస్లాం సహజంగానే దేశ జీవితంలో గొప్పపాత్ర నిర్వ హిస్తోంది. ఇందు వల్ల పెరిస్త్రోయికా క్రమం, ప్రజాస్వామ్యీకరణలు **ఇస్లాంమతం** పట్ల సోవియట్ నాయకత్వపు వైఖరిని మార్చాయా లేదా అన్న ప్రశ్న చాలామందికి ఆసక్తి గల అంశం

ప్రతిష్టంభన కాలంలో ఆచరణలో పెట్టిన (ఉదాహరణకు, ఉజ్బెకిస్తాన్‌లో) "విభజించి పాలించు" అన్న సూత్రాన్ని మత రంగానికి పూర్తిగా వర్తింపజేయడం జరిగింది. యీ సూత్రం క్రిస్టియన్ ఈస్టర్ పండుగ రోజుల్లో, లేక ఇస్లాం విందు దినాల్లో తాష్కెంట్‌లో ప్రత్యేకించి బలంగా వ్యక్తమయ్యేది. అప్పుడు, ఎక్కువమంది ఆస్తికులు సమావేశం కాకుండా నివారించడానికి ఆర్థొడాక్స్ స్మశానాలకు, చర్చీలకు, మసీదులకు వెళ్ళే మార్గాలను మిలిషియావారితో నింపివేసేవారు. ముస్లింల స్మశానాలకైతే రష్యన్ మిలిషియాను, ఆర్థొడాక్స్ స్మశానాలకు ఉజ్బెక్ మిలిషియానూ పంపేవారు. యిది సహజంగానే ఆస్తికుల్లో కావేషాన్ని పెంచి జాతుల మధ్య వైరం అధికాధికంగా ప్రజ్వరిల్లేలా చేసేది. యిలాంటి ఆదేశాలను ఇస్తూండిన అధికార్లను తీసివేయడం జరిగింది. యిప్పుడు ఆస్తికుల పూజా, క్రతువులు జరిగే చోట్లకు మిలిషియా వారిని పంపడం లేదు.

యువ ఆస్తికుల విషయంలో గణనీయమైన మంచి మార్పులు వచ్చాయి. పూర్వం కామ్సొమోల్, పాఠశాల కౌన్సిళ్ళు, యితర సంఘాల లాంటి యువజన సంఘాల శక్తి యుక్తులను యువజనులను ఇస్లాంమత ప్రభావానికి దూరంగా ఉంచడానికి వినియోగించగా ఇప్పుడు తమకు చీవాట్లు పడతాయన్న భయం వారిలో లేదు కాబట్టి వారు స్వేచ్ఛగా ప్రార్థనా సమావేశాలకు హాజరవుతున్నారని మధ్యాసియా, కజక్‌స్తాన్‌ల ముస్లింబోర్డు ఉపాధ్యక్షుడైన షేక్ యూసఫ్ ఖాన్ షకిరోవ్ చెబుతున్నారు.

కొత్తగా కట్టిన మసీదుల సంఖ్య పెరుగుతోంది. గత కొద్ది సంవత్సరాల్లో మధ్యాసియా, కజకస్తాన్‌లలో 30 కి పైగా పెద్ద మసీదులు నిర్మించారు. వాటి సంఖ్య ఇప్పుడు 200 కు మించింది. ఉజ్బెకిస్తాన్ రాజధాని తాష్కెంట్‌లో ముస్లిం సమాజాల సంఖ్య కూడా పెరిగింది. ఇప్పుడక్కడ 17 సమాజాలు ఉన్నాయి. 1988 సెప్టెంబర్‌లో ద్జిజాక్ (ఉజ్బెకిస్తాన్) లోని ముస్లిం సమాజం తన కార్యకలాపాలను తిరిగి ప్రారంభించింది. జిల్లా అధికారులు పూర్వం మూసివేసిన తమ మసీదుకు వారు తిరిగి వచ్చారు. మధ్యాసియా, కజకస్తాన్‌ల ముస్లిం బోర్డు ప్రతినిధులు ఇక మునుపటి లాగా జరగదని అనుకుంటున్నారు.

సోవియట్ యూనియన్‌లో దాదాపు 500 మసీదులున్నాయి. కాని, యిది నిజమైన సంఖ్యను సూచించదు. ఎందుకంటే, ఇప్పటికీ నమోదుకాని ముస్లిం సమాజాలు అనేకం ఉన్నాయి. పైనాయకులను సంతోషపెట్టాలన్న కాంక్షకు దాసులై జిల్లా, మండల అధికారులు అనేకమంది ఆస్తికులకు మతంపై నమ్మకం పోయిందని నివేదికలు పంపేవారు. కానీ, వాస్తవానికి, అసలు పరిస్థితి పూర్తిగా వేరు. తమ సమాజాలను నమోదు చేయవలసిందిగా స్థానిక అధికార సంస్థలకు ఆస్తికులు దరఖాస్తులు పెట్టుకొన్నా, చట్టవిరుద్ధంగా, అందుకు నిరాకరించడం జరిగింది.

ఇస్లాంమతం పట్ల అధికారుల వైఖరి మారడం చూచిన సోవియట్ యూనియన్‌లోని ముస్లింలు ప్రస్తుతం జరుగుతున్న సోవియట్ సమాజ ఆత్మిక పునరుద్ధరణ క్రమంపట్ల సంతృప్తిని ప్రకటిస్తున్నారు; పెరిస్త్రోయికా క్రమానికి తమ వంతుదోహదం చేయడానికి ప్రయత్నిస్తున్నారు. యీ క్రమంపట్ల "వేచి చూద్దాం" అనే ఉదాసీన వైఖరి తీసుకోవడం, యీ క్రమంలో పాల్గొనకుండా మానివేయడం నీతిబాహ్యమని షేక్ యూసఫ్‌ఖాన్ షకిరోవ్ భావిస్తున్నారు.

# లెనిన్ రాజకీయ వీలునామా, సోషలిస్టు లక్ష్యాభిముఖ విధానంలోని కొన్ని సమస్యలు

వి. మాక్సిమెంకో,
క్యాండిడేట్ ఆఫ్ సైన్స్ (చరిత్ర)

1922 డిసెంబర్ నుంచీ 1923 మార్చి వరకూ లెనిన్ డిక్టేట్ చేసిన లేఖలకూ, వ్యాసాలకూ ఆయన రచనల్లో ప్రత్యేక స్థానంవుంది. వాటిలో ఉమ్మడిగా వున్నవిషయం అవి ఒక రకమైన లెనిన్ రాజకీయ వీలునామా అన్న భావం మనలో కలగజేస్తాయి. 1929 లో లెనిన్ 5 వ వర్ధంతి సందర్భంగా జరిగిన సమావేశంలో నికొలాయ్ బుఖారిన్ ఒక నివేదికను ఇచ్చారు. లెనిన్ తుది రచనలు ("ఒకడైరీ నుంచీ పుటలు," "మన విప్లవం", "కార్మికుల కర్షకుల అజమాయిషీని ఎలా పునర్వ్యవస్థీకరించాలి," "తక్కువే మేలు కాని మేలుగా వుండాలి" "సహకారం గురించి") విడివిడి రచనలు కాదు. అవి, స్పష్టమైన భవిష్యదవకాశాల ప్రాతిపదికపై రూపొందించిన లెనిన్ వ్యూహమూ ఎత్తుగడలకు సంబంధించినపెద్ద ప్రణాళికలోని అంతర్భాగాలు'' అని ఈ వక్త పేర్కొన్నారు.

ఈ లెనిన్ చివరి రచనలు ఇప్పటికీ వర్తిస్తాయని పరిశోధకుడు గ్రహించ గలిగినప్పుడే ఈ రచనల చారిత్రక, శాస్త్రీయ విశ్లేషణకు చేసిన గొప్పకృషికి ఫలితముంటుంది.

* * * * *

వర్ధమాన దేశాల్లో సోషలిజం వైపు మొగ్గును గురించిన పరిశోధన కోసం లెనిన్ రాజకీయ వీలునామాను విశ్లేషించేటప్పుడు, నేను అతి ముఖ్య అంశాలను మాత్రమే ప్రస్తావిస్తాను. వర్ధమానదేశాల్లో సోషలిజంవైపు మొగ్గుకు గల భవిష్యదవకాశాలపై చర్చలు నేడొక ప్రధాన సమస్య గురించి జరుగుతున్నాయి: జనాభాలో స్వతంత్రులైన సన్నకారు ఉత్పత్తిదారులు ఎక్కువగా ఉన్న బడుగు దేశాల్లోని బహుళ నిర్మాణపు జాతీయార్థిక వ్యవస్థల్లో, సోషలిజం లక్ష్యంగా గల సాధ్యమైన అత్యుత్తమ విధానమేది? లెనిన్ రాజకీయ వీలునామాలో కూడా ఈ సమస్యే ప్రధానాంశంగా ఉంది. కాని, బహుళనిర్మాణపు వ్యవస్థగల

ఆనాటి సోవియట్ రష్యాకూ, ఆఫ్రో-ఆసియా దేశాల బహుళ నిర్మాణపు వ్యవస్థకూ పోలికలు చూపడం సరికాదు. అది చారిత్రక దృష్టికాదు. కాబట్టి, నేడు సోషలిజంవైపు మొగ్గు గురించిన అధ్యయానానికి ఈ లెనిన్ రచన లలోని భావాలను అన్వయించడానికి ఒక పద్ధతివుంది. అదేమంటే సోష లిజం గురించిన దృక్పధాన్ని మౌలికంగా పునఃపరిశీలన చేయాలని లెనిన్ తన జీవిత చరమాంకంలో చెప్పిన దానిలోని తాత్వికతను వెల్లడించి సూత్రీకరించడం. ఇందుకు అనేక దృక్పథాలు అవలంబించవచ్చు. ఈవ్యాసంలో నేను సూచిస్తున్న దృక్పథం ఈ వీలునామా లోని ముఖ్యమైన అంశవిశ్లేషణకు సంబంధించినది. అదేమిటంటే, సోషలిజం లక్ష్యంగా పెట్టుకున్న ఒక రాజ్యపు రాజకీయ సంకల్పమూ, అసలు సోషలిస్టు ఆశయా నికిగల అర్థం.

లెనిన్ తన ఆఖరు లేఖల్లో, వ్యాసాలల్లో, అధికారంలో ఉన్న కమ్యూనిస్టుపార్టీ బలానికి, స్థిరత్వానికి ఎంతో ప్రాముఖ్యమిచ్చారు. పార్టీ నాయకుల గుణగణాలు, వారి మధ్య వ్యత్యా సాలు, పార్టీ అంతర్గత సంబంధాలు చాలా ముఖ్యమైన విషయాలుగా ఆయన పరిగ ణించారు. రాజ్యవ్యవస్థలోని రెండు పరస్పరా శ్రిత అంశాల విశ్లేషణలో, ఆయన ఈ విషయా న్ని యింకా విపులీకరించారు. ఆ అంశాలు యివి: రాజ్య వ్యవస్థసామాజిక స్వభావమూ, రాజ్యయంత్రాంగ స్వరూపమూ. ఇది చాలా ముఖ్యమైన విషయం, ఆదృక్పథం నుంచీ రాజ్య వ్యవస్థను విశ్లేషించిన మొట్టమొదటి మార్క్సిస్టు బహుశ లెనినే. సోషలిస్టు సంస్కర ణల లక్ష్యాభిముఖమైన రాజ్యవ్యవస్థకు చోదక శక్తిగా దానిలోని ఒక వైరుధ్యాన్ని ఆయన వెల్లడించారు. ఇక్కడ నేను ప్రస్తావిస్తున్నది రాజ్యంలోని రాజకీయ అధికారానికి, రాజ్య యంత్రాంగానికీ మధ్యగల వైరుధ్యం.

బహుళ నిర్మాణస్వరూప సోవియట్ రష్యాలో ఒక కొత్తతరహా రాజ్యవ్యవస్థ అవత రించింది. 1921 లో నూతన ఆర్థిక విధానం వైపు దృఢంగా మలుపు రావటంతో ఆ రాజ్య సామాజిక పునాది కార్మికులూ, రైతులూ అనేది స్పష్టమైంది. అయితే ఆ రాజ్యయంత్రాంగం "చాలా అధ్వాన్నంగా ఉందనీ," అది మనకు ఇప్పటికీ పూర్తి "పరాయిది" అనీ ఆయన పలుసార్లు చెప్పారు. ఆవిధంగా, రాజ్యం తాలూకు రెండు పార్శ్వాల మధ్య— దాని వర్గ పునాది స్వభావానికీ, దాని నిర్మాణ స్వరూపపు బ్యూరాక్రటిక్ స్వభావానికీ మధ్య — వైరుధ్యం వ్యక్తమైంది. ఈ వైరుధ్యం చాలా తీవ్రరూపం ధరించవీలుందని, ప్రభుత్వ యంత్రాంగం

---

వ్లాదిమిర్ మాక్సిమెంకో



నియంత్రిత వ్యవస్థగా ఉండటానికి మారు నియంత్రించే వ్యవస్థకాగల పరిస్థితి ఏర్పడగ లదని ఆయన అభిప్రాయపడ్డారు. అది, సంస్కరణలను తేవలెననే రాజకీయ వాంఛ ను హుళక్కి చేస్తుందనీ, కొత్త ప్రభుత్వ వ్యవ స్థను దిగజార్చుతుందనీ లెనిన్ భావించారు. కాబట్టి, పైన పేర్కొన్న వైరుధ్యాన్ని పరిష్క రించే అవకాశాన్ని కనుగొనడం ఎంతో ముఖ్యమైన కర్తవ్యమైంది. రాజ్య వ్యవస్థ ప్రత్యక్ష బలప్రయోగ శక్తికీ, సామాజిక పరిణా మాలపై దాని పరోక్ష ప్రభావానికీ గల పరస్పర సంబంధంలో వచ్చే మార్పు అటువంటి అవకా శం ఇస్తుందని లెనిన్ కనుగొన్నారు.

నెప్ (నూతన ఆర్థిక విధానం) నాటి సోవియట్ రష్యాలోని ప్రభుత్వ వ్యవస్థలో ఉన్న కొత్తదనం రాజకీయాధికార శ్రామిక వర్గస్వభా వమే అని లెనిన్ భావించారు. మరింత కచ్చితంగా చెప్పాలంటే కార్మిక వర్గం రాజకీయ నాయక శక్తిగా ఉన్న ఒక రాజకీయ సంఘటన పాలించే రాజ్యపు బూర్జువా వ్యతి రేక స్వభావమే ఈ కొత్తదనం. ప్రభుత్వ, రాజకీయ వ్యవస్థల సంఘటన రూపాన్ని తెచ్చి పెట్టినది నూతన ఆర్థిక విధానమే. అందువ ల్లనే యుద్ధకమ్యూనిజమన్న విధానాన్ని విసర్జించడం జరిగింది.

కార్మికులూ, రైతులు ఒక సంఘటనగా అధికారం చెలాయించటం తాత్కాలికమైనది కాదని, నెప్ కు గల అవకాశాల దృష్ట్యా లెనిన్ నిర్ణయించారు. ఈ రెండు వర్గాల మధ్య ఉన్నదీర్ఘకాలిక ఒప్పందం దృష్ట్యా కార్మికుల, రైతుల సంఘటనా ప్రభుత్వంగురించి, లెనిన్ తన రాజకీయ వీలునామాలో చర్చించారు. ఈ సంఘటనలోని ఈ రెండు వర్గాలూ దేనికది తన వర్గ స్వభావాన్ని అట్టిపెట్టుకుంటాయి. ఒక్క ముక్కలో చెప్పాలంటే, పరిపాలన, రాజకీయ సంకల్పాన్ని విప్లవ సంస్కరణల స్వయంసమృద్ధ సూత్రంగా లెనిన్ పరిగ ణించలేదన్నమాట. అది శ్రామిక ప్రజల్లోని రెండు వర్గాల మధ్య ఒప్పందంపై ఆధారపడి ఉంటుందని ఆయన నిర్ధారణ. వీటిలో ఒకటి కార్మిక వర్గ స్వభావం కలది, రెండవది శ్రామిక ప్రజా వర్గ స్వభావాన్ని సన్నకారు ప్రైవేట్ ఖామందుల స్వభావాన్ని అంటే, తన ద్వంద్వ స్వభావాన్ని అట్టి పెట్టుకున్న వర్గం. ఈ లెనిన్ భావన సూత్ర రీత్యా కొత్తది. అంతేకాదు ఈ రకమైన బహుళ నిర్మాణపు ఆర్థిక వ్యవస్థలో కేవలం సరకు ఉత్పత్తే కాక, ప్రైవేటు పెట్టు బడిదారీ ఉత్పత్తి, ప్రభుత్వ పెట్టుబడిదారీ ఉత్పత్తికూడా ఉంటాయి. ఈ సామాజిక వ్యవస్థ ఈ రెండు వర్గాల సహకారంపై ఆధారపడి ఉందనీ, దీనిలో బూర్జువా వర్గం'' కొన్ని షరతులపై పాల్గొనడానికి ఇప్పుడు అనుమ తించబడుతుంది.'' అనీ లెనిన్ రాశారు.

## లెనిన్ రాజకీయ వీలునామా, సోషలిస్టు లక్ష్యాభిముఖ విధానంలోని కొన్ని సమస్యలు

రష్యాలో బూర్జువావర్గాన్ని కూలదోయడం, దాని ఆస్తులను జప్తుచేయడం జరిగింది. మరి ఇప్పుడు శ్రామిక ప్రజల్లోని కార్మిక, కర్షక వర్గా లకు, బూర్జువా వర్గానికి మధ్య సహకారం గురించిన ఈ మాటలు, అందుకు విరుద్ధమైనవి కావా అనవచ్చు. 1917-22 మధ్య రష్యాలోని బహుళ నిర్మాణపు సామాజిక వ్యవస్థలో పెంపొందిన క్లిష్టతే ఈ వైరుధ్యానికి కారణం. శ్రామిక ప్రజలకు చెందిన ఈ రెండు వర్గాలతో ప్రభుత్వ స్థాయిలో బూర్జువా వర్గం సహకరించ డానికి లెనిన్ ఒక షరతు విధించారు. అది సాంస్కృతిక, నాగరీకరణ కార్యకలాపాల్లో మాత్రమే పాల్గొనాలన్న షరతు, అదే సమయంలో దోపిడీదారులుగా బూర్జువా వర్గం పెంపొందకుండా నెప్ అరికట్టింది.

సాంస్కృతిక విప్లవం గురించి వివరించే టప్పుడు, ''కార్మిక వర్గ సంస్కృతిని'' గురించి



కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ప్రథమ మహాసభ అధ్యక్షవర్గంలో వి.ఐ.లెనిన్. 1919 మార్చి.

ఆషామాషీగా రాసేవారిని ఆయన అడ్డుకున్నారు. సంస్కృతి, విపరీతమైన గతాను గతికతతో సాగే కార్య కలాపాల రంగమనీ, దాన్ని "కార్మి కీకరించడానికి," లేదా ఇష్టమొచ్చిన రాజకీయ కృషితో సంస్కరించడానికి వీలు లేదనీ లెనిన్ అభిప్రాయం. మౌలికమైన సామాజిక సంస్కరణదశల్లో సైతం, 'అయిదే ళ్ళలో చేయగల దానికీ, అంతకన్నా ఎక్కువ కాలం పట్టేదానికీ" మధ్య తేడా చూపాలని ఆయన అన్నారు.

సాంస్కృతిక విప్లవం గురించిన లెనిన్ భావంలో మూడు ప్రధాన ధోరణులున్నాయి. అవి: సంపూర్ణ అక్షరాస్యత; "బూర్జువాదశ పూర్వపు మొరటు రకాల సంస్కృతి తటస్థీకరణ", అత్యున్నత రాజకీయ నాయకత్వంలోనూ, ప్రభుత్వ యంత్రాంగంలోనూ, కాలంతో నిజంగా అడుగు కలిపి నడిచే కార్యకర్తలను, కేంద్రీకరించడం.

పాత సంస్కృతిని గురించిన లెనిన్ భావమిది: అందులో పాత అన్యాయాలు, నిర్బంధ చర్యలను గురించిన ప్రజల స్మృతులు (ఈ సందర్భంలో బ్యూరాక్రటిక్ సంస్కృతి, అర్థభూబానిసల సంస్కృతి మొదలైన వాటిని లెనిన్ పేర్కొన్నారు) వుంటాయి. అదే సమయంలో అందులో విప్లవ ప్రభుత్వం స్వీ కరించవలసినవెన్నో వుంటాయి. వాటిని ఆకళించుకోకపోతే ఏ విప్లవ ప్రభుత్వమూ సరియైన నిర్ణయాలు చేయలేదు. కొత్తతరహా రాజ్యవ్యవస్థలో, విధానానికి సంబంధించిన ప్రధానవైరుధ్యాన్ని (ప్రభుత్వానికిగల కార్మిక-క ర్షక సామాజిక స్వభావానికీ, దాని రాజ్యాధికార యంత్రాంగానికీ మధ్యగల వైరుధ్యాన్ని)

పరిష్కరించడానికి సంస్కృతి ఒకటే తోడ్పడు తుందని లెనిన్ అన్నారు. అంతగానూ ముఖ్యమైన రెండవ కర్తవ్యం పల్లెసీమ సాంస్కృతికాభివృద్ధికి సర్వవిధాలా తోడ్పడటం, దానిపై గలపెట్టుబడిదారీ ప్రభావాన్ని ప్రతి ఘటించడం. గ్రామానికీ, పట్టణానికీ మధ్య సంబంధాల స్థాపనలోని సారభూతాంశమిదే.

* * * * * *

అనాడు వెనుకబడిన బహుళ నిర్మాణపు ఆర్థిక వ్యవస్థకు ఉద్దేశించిన సోషలిజం యుద్ధ కమ్యూనిజానికి ప్రత్యామ్నాయం. సోషలిజంగురించిన ఈ భావానికి ప్రాతిపదిక ఏమిటి? లెనిన్ లేఖలూ, వ్యాసాల్లో దీనికి సమాధానం ఉంది. ఒక కొత్తతరహా రాజ్యవ్యవస్థ అవతరించినప్పుడు ప్రభుత్వయంత్రాంగం వల్లవచ్చే ప్రమాదాన్ని అరాజ్య వ్యవస్థ, ప్రజలను సహకార సంఘాల్లో సంఘటితం చేయడం ద్వారా తన కార్మిక-కర్షక పునాదిని అట్టిపెట్టుకుని కాపాడుకుంటుంది. ఈ సందర్భంలో లెనిన్, రాబర్ట్ ఓవెన్ లాంటి మునుపటి సహకారవాదుల పథకాలను ఒక కొత్తదృక్పథంతో చూచారు. ప్రజలను సహకార సంఘాల్లో సంఘటితం చేయడం ద్వారా రాజ్యాధికార వ్యవస్థ "వర్గశత్రువులను వర్గసహచరులుగా, వర్గ యుద్ధాన్ని వర్గశాంతిగా" మార్చగలదని సూచనప్రాయంగా చెప్పారు. యుద్ధ కమ్యూనిజం తర్వాత, కేంద్రీకృత పంపిణీ యంత్రాంగం ద్వారా ప్రైవేటు ఆస్తిని రద్దు చేయడానికై వృథా ప్రయత్నం జరిగిన తర్వాత, ప్రభుత్వం బలాత్కారంతో, రాజ్యవ్యవస్థలేని కమ్యూనిజానికి మారటానికి చేసిన ప్రయత్నాలు విఫలమైన తర్వాత లెనిన్ రాసిన మాటలవి. ఆ చారిత్రక దశలో సోషలిజం గురించి ఒక కొత్త అవగాహన అవసరమైంది. ఆ అవగాహన మూలంగానే సోషలిస్టు కార్యకలాపాల విషయంలో ప్రాధాన్యం విధానరంగం నుంచీ, రాజకీయాధికారం నుంచీ, వర్గపోరాటం మొదలైన వాటినుంచీ "శాంతియుత వ్యవస్థాత్మక సాంస్కృతిక రంగానికి" మారింది. "పూర్తిగా నిరుపయోగమైన మన యంత్రాంగపు" సాంస్కృతిక స్థాయిని పెంచడం, అందువల్లనే అవసరమని లెనిన్ అన్నారు. రెండవది, రైతులను సహకార సంస్థల్లో సంఘటితపరచడానికై వారికి ప్రబోధించే కృషిని ముమ్మరం చేయాలన్నారు.

## లెనిన్ రాజకీయ వీలునామా, సోషలిస్టు లక్ష్యాభిముఖ విధానంలోని కొన్ని సమస్యలు

లెనిన్ రాజకీయ వీలునామా ఒక కరడుగట్టిన "సిద్ధాంతాన్ని" ప్రతిపాదించడంలేదు. ఆ లేఖలూ, వ్యాసాలు సూచనలే తప్ప ఆదేశాలు కావు. ఈ దృష్టితో చూచినప్పుడు మాత్రమే, నేటి వర్ధమాన దేశాల్లో సోషలిజం వైపు మొగ్గుకు సంబంధించిన సమస్యల విశ్లేషణకు లెనిన్ నిర్ధారణలను ఉపయోగించుకోగలం. బడుగు ఆర్థిక వ్యవస్థలుగల దేశాల్లో సోషలిజాన్ని అభివృద్ధి చేసేందుకు, సిద్ధమైన ఒక "పథకం" లెనిన్ రచనల్లో ఉందనుకోరాదు. కాని కొన్ని సూత్రాలు ఏదేశాల్లోని సోషలిస్టులకైనా ఉపయోగపడుతాయి. సోషలిజాన్ని ఒక ధర్మసూత్రంగా పరిగణించరాదని లెనిన్ చెప్పారు. అభివృద్ధికి మార్గాలను ఎంచుకునే అవకాశం సోషలిజంలో గర్భితమని లెనిన్ చెప్పారు. రాజ్యవ్యవస్థ బలత్కారమో, కేంద్రీకృత రాజకీయ సంకల్పం చైతన్యంతో పాటించే నిగ్రహమో ఈ రెంటిలో ఒకదాన్ని ఎంచుకునే అవకాశముండాలి. ఆర్థిక సంబంధాలపై రాజ్యవ్యవస్థ నియంత్రణ స్థాపననో ఈ సంబంధాల సామాజికీకరణనో ఎంచుకునే అవకాశం వుండాలి. ఈ ఎంపికనూ, మన కాలంలో దీని ఆవశ్యకతనూ గుర్తించిన ప్రజల చైతన్యం, సంకల్పాలపై, వర్ధమాన దేశాల్లోనూ, మొత్తం ప్రపంచంలోనూ, సోషలిజం భవిష్యదవకాశాలు ఆధారపడి ఉన్నాయి.

(ఆసియా, ఆఫ్రికా టుడే నుండి సంక్షిప్తం)

## సోవియట్-భారత రాజకీయ సహకారాభివృద్ధి, భవిష్యదవకాశాలు

(7 వ పేజీ తరువాయి)

చేసింది. అణు, అంతరిక్షయుగంలో మానవ మనుగడ, ప్రగతుల తాత్వికతమూల సూత్రాలు ఢిల్లీ ప్రకటనలో ఉన్నాయి; అది ప్రపంచంలోని సార్వత్రిక రాజకీయ వాతావరణంపైసానుకూల ప్రభావం నెరపింది. అంతర్జాతీయ సంబంధాల పునర్వ్యవస్థీకరణకు ప్రేరణనిచ్చింది. ప్రపంచ సమస్యలపై రెండు దేశాల ఉమ్మడి అవగాహనలను, మానవాళి భవితవ్యంపై ఉమ్మడి దృక్పథాన్ని అది ప్రతిబింబించింది అని శిఖరాగ్ర సమావేశ ప్రకటన నొక్కి చెప్పింది.

సోవియట్ యూనియన్, భారతదేశాల మధ్య సంబంధాలను, ఈ శిఖరాగ్ర సమావేశ ప్రకటన యిలా పేర్కొంది: "ఈ సంబంధాలు లోతుగా వేరూనాయి; యివి, భిన్న సామాజిక రాజకీయ వ్యవస్థల మధ్య నిర్మాణాత్మక సహకారానికి ఆదర్శ ప్రాయమైనవి. చిత్తశుద్ధితో కూడిన స్నేహం, పరస్పర అవగాహన వీటి విశిష్ట లక్షణం. ఈ సంబంధాలు దశాబ్దాలుగా నిలకడగా, నిరంతరాయంగా పెంపొందాయి."

"తమ సంబంధాలను అన్ని రంగాల్లోనూ యితోధికంగా అభివృద్ధి పర్చి మరింత ప్రగాఢం చేయాలి," అన్న కృతనిశ్చయాన్ని తమ ప్రకటన ముగింపులో సోవియట్ యూనియన్, భారతదేశం వ్యక్తంచేశాయి. అవి యిలా నొక్కి చెప్పాయి. "సోవియట్-భారత సంబంధాల అభివృద్ధి, వాటి ప్రజల ప్రయోజనానికి అనుగుణంగా ఉంది; సమగ్ర ప్రాతిపదికపై శాంతి, భద్రతలను పటిష్ఠ మొనరించడంలో, ఆసియాలోను, యావత్ప్రపంచంలోను అభివృద్ధిని పెంపొందించడంలో అది ఒక ముఖ్య కారకం."

ప్రధాన ప్రపంచవ్యాప్త సమస్యల పట్ల నూతన రాజకీయ ఆలోచనా ధోరణికి, నూతన వైఖరులకు సంబంధించి అనేక స్పష్టమైన లక్షణాలు మొదటిసారిగా సోవియట్-భారత సంబంధాల్లో వ్యక్తమయ్యాయని చెప్పడం సముచితమే. యీ రెండు దేశాల మధ్య ఫలప్రదమైన రాజకీయ చర్చ, పరస్పర ప్రయోజనకర ఆర్థిక సంబంధాలు, విస్తృత సాంస్కృతిక ఆదాన ప్రదానాలు ఈ రెండు దేశాల ప్రయోజనాలకే గాక మొత్తంగా ప్రపంచ ప్రయో జనాలకు కూడా అనుగుణంగా ఉన్నాయి. సోవియట్-భారత సంబంధాలు శాంతియుత సహజీవనానికి ఆదర్శప్రాయమైనవి. దేశాల రాజకీయ వ్యవస్థ, వైశాల్యం, భౌగోళిక స్థానంతో ప్రమేయం లేకుండా హేతుబద్ధతపై, సైనిక బలప్రయోగ విసర్జనలపై ఆధారపడినట్టీ, న్యాయమైనట్టీ, అన్ని రాజ్యాలకూ ప్రయోజనకరమైనట్టీ ఒక నూతన న్యాయమైన ప్రజాతంత్ర అంతర్జాతీయ వ్యవస్థను స్థాపించడానికి యీ సంబంధాలు ఒక శక్తివంతమైన కారకం అవుతున్నాయి.

ప్రాపంచ శాస్త్రం

# ప్రాచీనుల ఖగోళక పరిశీలనా శాలలు

అనతోలి పెచెర్‌స్కీ,

సోవియట్ యూనియన్ భూగోళ శాస్త్ర సంఘ పూర్తిస్థాయి సభ్యుడు

ఇంతవరకు కారణాలు తెలియని కొత్త ప్రకృతి పరిణామాన్ని గురించో, ప్రాచీన మానవ నిర్మిత వస్తు విశేషాన్ని లేదా కట్టడాన్ని గురించో మనం విన్నప్పుడల్లా, అదేదో నిగూఢ రహస్యమన్న భావం కలగడం కద్దు. కిర్గిజ్‌లో శాందిక్ లోయలో ఉన్న రాతి వలయాలు అటువంటి రహస్యాల్లో కొన్ని. రాతి వలయాల తూర్పువక్కల్లో, తొలిచిన సన్నని రంధ్రాలున్నాయి. ఈ రంధ్రాలను ఎందుకు తొలిచారు? నా నాయకత్వాన అక్కడికి వెళ్ళిన పరిశోధక బృందం ఈ రహస్యం ఛేదించేందుకు ఎంతో కృషి చేసింది. రాత్రి, పగలు సమానంగా వుండే, వసంత రుతువు ఆరంభ దినమూ (విషువత్తులు) అయిన మార్చి 21 న మేము ఒక రాతి వలయంలో నుంచి సూర్యోదయం చూడటం తటస్థించింది. దానితో మాకొక ఊహ తట్టింది. ఈ రాతివలయం ప్రాచీన మానవునికి వసంతాగమనాన్ని తెలిపే సాధనమా? నమ్మశక్యం కాని ఈ ఊహను మిగతారాతి వలయాలు కూడ నిజమని నిరూపించాయి. ఆ రాతి వలయాలు ఆకురాలు రుతువు ఆరంభదినాన్ని అంటే విషువత్తును (సెప్టెంబరు 21) కూడ తెలుసుకునేందుకు తోడ్పడ్డాయి. అప్పుడు ఐర్లండులోని ఒక ప్రసిద్ధదిన్నె మాకు జ్ఞాపకం వచ్చింది. అది 5,000 సంవత్సరాల క్రితం నిర్మాణమయింది. దానికి ఒక క్షితిజ సమాంతర సొరంగం ఉంది. సంవత్సరంలో ఒక దఫా కొన్ని నిముషాల పాటు సూర్యకిరణాలు దాని గుండా ప్రసరిస్తాయి. అయితే, ఒక తేడా ఉంది. ఈదిన్నె సంవత్సరంలో రాత్రి చాలా ఎక్కువ, పగలు చాలా తక్కువవుండే రోజును (డిసెంబరు 21 లేక 22) గుర్తించడానికి తోడ్పడుతుంది. ఈజిప్టులోని చియోప్స్ పిరమిడ్ నిర్మాతలు కూడ ఇటువంటి కాలండర్‌ను రూపొందించు కున్నారు. ఈ పిరమిడ్ ఉత్తర పార్శ్వంలో ఒక ఏటవాలు సొరంగం ఉంది. దీని పొడుగూతా వెళ్ళే ఒక ఊహారేఖ 4,500

సంవత్సరాల క్రితం ఆకాశంలో ధ్రువ నక్షత్రం ఉన్నస్థలాన్ని చూపుతుంది. (ఒకే నక్షత్రం ఎప్పుడూ ధ్రువ నక్షత్రంగా ఉండదు. భూ అక్షం భ్రమణము సూర్యుని, చంద్రుని, యితర గ్రహాల గురుత్వాకర్షణ ప్రభావం వల్లమారుతుంది కాబట్టి వేరువేరు నక్షత్రాలు ధ్రువ తార స్థానంలో ఉంటాయి)

తర్వాత మేము ప్రాముఖ్యమున్నవి కావని అనుకొన్న రెండు చిన్నని రాతివలయాలను. పరిశీలించి చూచాము. వీటి తూర్పు పార్శ్వంలో రంధ్రాలుండటమేగాక, వాటికి ఉన్ముఖంగా వరుసగా రాళ్ళున్నాయి. సంవత్సరంలో రెండు సార్లుమాత్రమే అంటే పగలు చాలా ఎక్కువ, రాత్రి చాలా తక్కువసేపు వుండే జూన్ 21న పగలు చాలా తక్కువ రాత్రి చాలా ఎక్కువ సేపు వుండే డిసెంబరు 21, లేదా 22 న మాత్రమే, వీటిపై సూర్య కాంతి పడుతుంది. (పటం1 చూడండి) దీనితో, ఈ రాతి వలయాలు ప్రాచీన ఖగోళ పరిశీలనా సాధనాలని ధ్రువ పడింది.

ఇంగ్లండులో, వలయాకారంలో అమర్చిన గండ శిలలు ఏమై ఉంటాయని పరిశోధకులు చాలాకాలంపాటు ఆలోచించారు. ఇవికూడ 3,800 సంవత్సరాల క్రితం ఇక్కడున్న ప్రాచీన మానవులు నిర్మించినవే. తుదకు, కంప్యూటర్ సహాయంతో వీటి రహస్యాన్ని తెలునుకోగలిగారు. చాలా ఖచ్చితంగా సూర్య చంద్రోదయాలను, అయునాలను తెలుసుకునేందుకూ, సూర్య, చంద్రగ్రహణాలను సైతం ముందుగా ఊహించి చెప్పడానికీ వీలైన రీతిలో ఈగండ శిలలను అమర్చారని తేలింది.

ఒక చోటనుండి మరొక చోటకు ఎప్పుడు వలస పోవాలో, యెప్పుడు కంద మూలాది ఆహార పదార్థాలను సేకరించాలో తెలుసుకోవడానికి ప్రాచీనులకు ఖగోళ శాస్త్ర జ్ఞానం అవసరమయింది. కాని, దాని ప్రధాన ప్రయోజనం విత్తనం వేసే రుతువు ఎప్పుడు ప్రారంభమవుతుందో తెలుసుకోవడం. గ్రహగమన జ్ఞానం లేనిదే విత్తనాల రుతువును నిర్ణయించజాలమని వారికి తెలుసు.

ఈ ఉద్దేశంతోనే క్రీ॥పూ॥ 4-3 శతాబ్దాల్లో కోయీ-క్రిల్గాన్-కాలాలో ఒక పెద్ద ఖగోళ పరిశీలనాశాల నిర్మాణమయింది.

ఇరువైపుల కరకట్టలుగల రాతి గోరీదిబ్బలను మధ్య దక్షిణ కజకస్తాన్, కాల్మీకియాలలో క్రీ.పూ 7-4 శతాబ్దాల కాలంలో నిర్మించేవారు. ఇవి ప్రాచీనులకు పుణ్యస్థలాలే కాకుండా ఆదిమకాలపు ఖగోళ పరిశీలనా సాధనాలు కూడ. 1927 తరువాత జరిపిన తవ్వకాల్లో, కృత్రిమంగా వికృతం చేయబడిన పుర్రెలు గల మానవ అస్తివంజరాలు బయటపడ్డా



యి. మృతుల నరవర్గాన్ని తెలియజేసే ఉద్దేశంతో ఈ పుర్రెలను "గుమ్మడి పండు" ఆకారంతో ఒత్తి, పట్టీలతో బిగించారని పరిశోధకుల అభిప్రాయం. కిర్ఘిజియాలోని తాలాస్ నది సమీప ప్రాంతంలో కూడ పురాతత్వ తవ్వకాల్లో ఇటువంటి పుర్రెలు బయటపడ్డాయి. స్మశాన వాటిక ద్వారంవద్ద స్థానిక పామీర్-ఫెర్గానా నరవర్గాలకు చెందినవారి అస్తిపంజరాలు బయటపడ్డాయి. బానిస యజమానులు చనిపోతే అంత్యక్రియల్లో, వారి సేవకులను, బానిసలను చంపి సమాధివద్ద పూడ్చేవారట. ఇలాంటి పుర్రెలుగల అస్తిపంజరాలు అమెరికన్ రెడ్ ఇండియన్ల స్మశాన వాటికల్లో కూడ బయటపడ్డాయి.

దీన్నిబట్టి చరిత్ర పూర్వపు రోజుల్లో మతం, రుతు పరిజ్ఞానం ఒకటిగా ఉండేవనీ, దేవాలయాలు ఖగోళ పరిశీలనా శాలలుగాను, పరిశోధనా ప్రయోగశాలలుగానూ ఉండేవనీ కొందరు పండితులు చెప్పేది నిజమని తోస్తుంది. గౌటెమాలాలోని విషాక్తున్‌లో ఇండియన్ పిరమిడ్లపై విశాలమైన వేదికలున్నాయి. ఈ పిరమిడ్లు మాయాప్రజలకు పవిత్ర దేవాలయాలుగానూ, ఖగోళ పరిశీలనాశాలలుగానూ ఉపకరించేవి. వేదికపైనుంచీ వారు సూర్యుణ్ణి గమనించి చూచేవారు. పిరమిడ్/ఖగోళ పరిశీలనాశాలలనూ, ఒకే పునాదిపై కట్టబడిన మూడు దేవాలయాలనూ, శిలావేదికలనూ ఉపయోగించి, వారు విషువత్తులను, ఉత్తర దక్షిణాయనాలను, వాటిమధ్య గల వ్యవధిని ఖచ్చితంగా నిర్ణయించగలిగేవారు. (2వ పటం చూడండి).

1972లో, విక్టర్ నెమ్‌చెంకో, సెర్గీ బుల్గకోవ్, పావెల్ పెచెర్‌స్కీ, ఈ వ్యాస రచయితా సంద్యక్ లోయలో రెడ్‌ఇండియన్ దేవాలయ/ఖగోళ పరిశోధకశాల వంటి కట్టడాన్నే కనుగొన్నారు. ఈ కట్టడం సూర్యుని నిర్దిష్టమైన మూడు స్థానాలను సూచించడం యాదృచ్ఛికం కాదు. సరిగ్గా ఈ విగ్రహం తల మీదుగా, మార్చి 21, సెప్టెంబరు 22, లేదా 23 తారీఖుల్లో సూర్యోదయం అవుతుంది. దానికి ఇరుపక్కలా ఉన్న రెండు రాతి కరకట్టలు ఉత్తర, దక్షిణాయనాల్లో సూర్యోదయాన్ని సూచిస్తాయి. కట్టల మధ్యలో పూడ్చబడిన గుర్రాలు, దేవునికి బలియిచ్చినవై ఉండాలి. గుర్రానికి ప్రాచీన భారతీయ భాషలో వాడిన పదం "అశ్వం" ఇది ఉషస్సు సోదరులుగా ప్రాచీన భారతీయ గాథలు పేర్కొన్న "అశ్వినుల"న్న పదంనుంచి వచ్చి ఉంటుంది.

(తెక్నికా మోలోదేఝి పత్రిక నుంచీ)



ఐ. సుచ్కోవ్,
క్యాండిడేట్ ఆఫ్ సైన్స్ (చరిత్ర)



భారతదేశ సుదీర్ఘ చరిత్ర, సుసంపన్న సంస్కృతుల పట్ల సోవియట్ యూనియన్‌లో చిరకాలంగా ప్రగాఢ ఆసక్తి ఉంటోంది. ప్రజల జిజ్ఞాసను దృష్టిలో వుంచుకొని సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ సంపాదక వర్గం రష్యన్ భాషలో భారతదేశ దర్శినిని ప్రచురించాలని నిర్ణయించింది.

ఆ నిర్ణయానుసారం దీన్ని 1982 నుంచీ ప్రచురిస్తున్నారు. తాజా ప్రచురణలో (1987 భారతదేశం దర్శిని, నవూకా ప్రచురణాలయం, మాస్కో

1988), ఇండాలజీ, తదితర ప్రాచ్య విషయ పరిశోధకులైన సోవియట్ పండితుల రచనలున్నాయి. ఒ.వి. మాల్యరోవ్ రాసిన "1980లలో భారతదేశ సామాజిక-ఆర్థికాభివృద్ధి" అన్న వ్యాసంతో ఈదర్శని ప్రారంభమవుతుంది. ఏడవ పంచవర్ష ప్రణాళిక గురించిన విశ్లేషణను ఆధారంగా చేసుకుని భారతదేశ సామాజిక- ఆర్థికాభివృద్ధివిధానాలను ఈ వ్యాసం వివరిస్తోంది. ఆర్థిక, సామాజిక దృక్కోణాలనుంచి చూస్తే, కింది వ్యాసాలు ఎంతో ఆసక్తిదాయకమైనవి. "దారిద్ర్య నిర్మూలనా కార్యక్రమాలు: పరిణామమూ, ఫలితాలు" అన్న గొర్యచెవా వ్యాసం; "1980లలో భారతదేశానికీ, పారిశ్రామిక పెట్టుబడిదారీ దేశాలకూ మధ్య ఆర్థిక సంబంధాలు." అన్న ఎ.వి.మురొవ్యేవ్ వ్యాసం.

ఇండాలజీ, చరిత్ర, సంస్కృతులకు సంబంధించిన భాగంలోని "స్వాతంత్ర్య కాలంలో చిన్న నరవర్గ బృందాల ప్రజా ఉద్యమాల సమస్యలు" అన్న జి.ఎం. గ్రిగొర్యెవా వ్యాసం, "జాతీయోద్యమంలో మహాత్మా గాంధీ, హరిజనుల పాత్ర" అన్న ఇ.ఎస్.యుర్లోవా వ్యాసం మొదలైనవి ప్రత్యేకించి ఆసక్తిదాయకమైనవని నా అభిప్రాయం.

గత నాలుగు దశాబ్దాల భారత స్వతంత్రాభివృద్ధిలో "చిన్న నరవర్గ బృందాలు", "తెగలు" దేశరాజకీయ వ్యవహారాలలో అధికాధిక పాత్ర వహించాయనీ, స్వతంత్ర భారత ప్రభుత్వాన్ని ఇందుకు అభినందించవలసి ఉందనీ గ్రిగొర్యెవా నిర్ధారణ చేస్తున్నారు.

ఇ.వి. వనినా వ్యాసం మధ్య యుగాల చివరిదశలో భారత దేశ విజ్ఞాన శాస్త్రాలనూ, విద్యా బోధననూ గురించి వివరిస్తోంది. దీనిలోని ఒక ప్రత్యేక విభాగం ప్రకృతి శాస్త్రాల (వైద్య రసాయన, ఖగోళ శాస్త్రాల) అభివృద్ధిని వివరిస్తోంది. ఈ ఇతివృత్తం 12వ శతాబ్దాంతంతో ముగుస్తోంది. తర్వాత ఏమి జరిగింది? శాస్త్రాల అభివృద్ధి క్షీణించిందా? తదుపరి శతాబ్దాలు శాస్త్రాభివృద్ధికి ఉపకరించాయా? అనే ప్రశ్నలను ఇక్కడ వనినా లేవనెత్తుతున్నారు. చెల్లాచెదురుగా ఉన్నకొన్ని చారిత్రక వాస్తవాలను బట్టి, మధ్యయుగాల చివరి దశనుంచీ ఇటీవలి చారిత్రక దశవరకూ భారత విజ్ఞాన శాస్త్రాల, విద్యా బోధన స్థితిగతులను ఆమె స్థూలంగా చిత్రించారు. మధ్యయుగాలలో భారతదేశంలో ఇస్లాం వ్యాప్తితో ఆగ్రా, ఢిల్లీ, లాహోర్, అహ్మదాబాద్, బీదర్ నగరాలలోని విజ్ఞానశాస్త్ర, విద్యాకేంద్రాలు (మద్రసాలు) క్రియాశీల పాత్ర వహించనారంభించాయి. అవి ఇస్లాం మత పాఠశాలలైనప్పటికీ, 16వ శతాబ్దిలోని కొత్త ధోరణుల ప్రభావం వాటిపై బడింది. హిందూ, ముస్లిం సంస్కృతులు ఒకదానినొకటి పరిపుష్టం చేయడంతో సాహిత్య, వాస్తు శిల్ప, చిత్రలేఖన, సంగీతాది కళలలో కొత్త రూపాలు, ప్రక్రియలు ఆవిర్భవించాయి. గణిత శాస్త్ర కేంద్రాలు దేశం ఉత్తరాదిలోను, దక్షిణాది లోను నెలకొన్నాయని వనినా నిర్ధారణ. ఆ దశలో భారత-అరబ్ ఖగోళ శాస్త్రజ్ఞులు గణనీయ విజయాలు సాధించారు. భారతీయ భూగోళ శాస్త్రజ్ఞులు యూరోపియన్లకు తీసిపోలేదని, రసాయన, వైద్య శాస్త్రాలు కూడా అభివృద్ధి చెందాయని ఆమె అంటున్నారు. మొఘల్ సామ్రాజ్య విచ్ఛిత్తితోను, యూరోపియన్ల వలసవాద విస్తరణతోను దేశ శాస్త్రీయ, సాంస్కృతిక పురోగతి అంతరించిందని ఆమె అభిప్రాయం.

ఈ దర్శనిలో ఆర్.ఎం. మురెయేవ్ వ్యాసం, భారత స్వతంత్రాభివృద్ధి దశలో విద్యా, విజ్ఞాన శాస్త్ర రంగాల పరిస్థితిని తెలుపుతుంది. ఉన్నత, ప్రత్యేక సెకెండరీ విద్యా స్థాయిని పెంచడానికి సోషలిస్టు దేశాలతో భారత దేశ ఆర్థిక, సాంస్కృతిక సంబంధాలు ఎంతో తోడ్పడగలవనీ, దురదృష్ట వశాత్తూ, ఇటీవల వరకు వీటిని అంతగా ఉపయోగించుకోవడం జరగలేదని ఆయన చెబుతున్నారు.



# సిసిఫియన్ శ్రమ అంటే ఏమిటి?

ఐ.ఎస్.కోన్,

డాక్టర్ ఆఫ్ సైన్స్ (తత్వశాస్త్రం)

**1.** శ్రమ ప్రస్తుత ఫలితాలను ప్రస్తుత సమాజం ఉపయోగించుకునే వీలు లేనప్పుడు ఆ శ్రమ సిసిఫియన్ శ్రమ అవుతుంది. (సిసిఫస్ గ్రీక్ గాథల్లో, కొరింత్‌రాజు నరకలోకంలో ఒకగండశిలను అవిశ్రాంతంగా కింది నుంచి కొండ మీదికి దొర్లించుకునిపోతూ ఉండాలని అతనికి శాపం — అను.) అందువల్ల ఈశ్రమ వృథాప్రయాసే. కాని, అది అంతులేకుండా సాగుతూ ఉంటుంది.

**2.** దీనికి గల సామాజిక కారణాలువస్తుగతమైనవైనా కావచ్చు ఆత్మాశ్రితమైనవైనా కావచ్చు. సాంకేతిక, ఆర్థిక వెనుకబాటుతనంవస్తుగతమైనది. అవగాహనాలోపం, భావజాల జడత్వం మొదలైనవి ఆత్మాశ్రితమైనవి.

**3.** ఏ సమాజానికైనాసరే, నిరుపయోగమైన శ్రమపట్ల, ఆశ్రమ చేసే వ్యక్తికి తప్ప, ఆసక్తివుండదు. కాబట్టి, సిసిఫియన్ శ్రమ స్వచ్ఛందమైనదని దాని నిర్వచనంలోనే గర్భితం.

**4.** శ్రమించే వ్యక్తి తన శ్రమఫలితాలను, దాని సామాజిక ప్రాముఖ్యాన్ని గురించి ఎక్కువ అంచనావేసినప్పుడు, దాన్ని సార్థకంగా ఉపయోగించుకునే అవకాశాల గురించిన అంచనా తక్కువగా ఉన్నప్పుడు, ఈరెంటి మధ్య రేకెత్తిన ఘర్షణవల్ల మానసికంగా సిసిఫియన్ పరిస్థితి ఏర్పడుతుంది.

**5.** సిసిఫియన్ పరిస్థితి తాలూకు మౌలికాంశాలు; స్వయం విదితమైన కొద్దీ, ఈపరిస్థితి మరింత నాటకీయంగా పరిణమిస్తుంది. ఒక నూతన అంతర్‌విరుద్ధ శాస్త్రీయ సిద్ధాంత సత్యాన్ని నిరూపించడంకన్నా ఎక్కాల ఉపయోగాన్నీ ఆవశ్యకతనూ రుజువు చేయడం మరింత బాధాకరమైన పని.

**6.** సుదీర్ఘమైన సిసిఫియన్ పరిస్థితి వ్యక్తిని ప్రయోజనకరమైన సామాజిక కార్యకలా



పాలనుంచీ వెలివేసి, అతని ఆరోగ్యాన్నినాశనం చేస్తుంది. అతని మనస్సు పాడుచేస్తుంది. తుదకు, అతని అకాల మరణానికి దారి తీస్తుంది.

7. సైద్ధాంతికంగా ఒక సిసిఫియన్ పరిస్థితి కింది మార్గాల్లో పరిష్కారం కాగలదు. (ఎ) సమాజం అతనందజేసే ఫలితాలను తుదకు అంగీకరించడం; (బి) సిసిఫస్ తన పనిని మానుకోవడం; (సి) సిసిఫస్ శక్తికిమించిన ప్రయాసవల్ల చనిపోవడం;. (డి) పరిస్థితుల లోని ఒక యాదృచ్ఛిక ఘటనవల్ల ఘర్షణకు అర్థంపర్థంలేక పోవడం. కానీ, "ఎ", "డి" ఈరెండూ సిసిఫస్ ఇష్టాయిష్టాలపై ఆధారపడినవి కాదు. కాబట్టి అతను "ఎ" కోసం అర్రులుజాస్తూ "బి", "సి"లలో ఏదో ఒక దాన్ని ఎంచుకోక తప్పదు.

మరి ఈ విషయమై ఏమిచేయాలి?

1. నీవు చేసింది సామాజికప్రాముఖ్యం గలదని నీకు నమ్మకమేర్పడితే (ప్రజలచే గుర్తింపు మాత్రమే ఇటువంటి నమ్మకమివ్వ గలదు.) నైతికంగా, భౌతికంగా నీవెంత మూల్యం చెల్లించ వలసి వచ్చినాసరే, నీ పనిని ఏదోఒక విధంగా ఉపయోగపడేలా ధాన్ని మలచుకో.

2. ఈ ప్రయత్నం విఫలమై, నీవు సిసిఫియన్ స్థితిలో చిక్కు కొన్నప్పుడు నీవనికి, దాని ఆచరణాత్మక ఫలితాలేవైనా సరే కచ్చితమైన ఒకదీర్ఘకాల అవధి పెట్టుకో.

3. ఈ అవధిని చేరుకోగానే, నీవై సృష్టించుకొన్న ఈగండశిలను బద్దలు కొట్టు: అంటే నీకు సాధ్యమైన చోట నీపరిశోధనల వ్రాతప్రతిని ప్రచురించుకో. దాన్ని నీ మిత్రులకు పంచిపెట్టు. పురావత్రభాండాగారంలో దాచెయ్. దానిపై ఎవరికీ ఆసక్తి లేకపోతే, చెత్తకాగితాలు పోగుచేసే సంస్థకిచ్చెయ్ (ఉచితంగా ఇవ్వు. ఎందువల్లనంటే నీనిరుపయోగమైన కార్యకలాపాల ఫలితానికి డబ్బు తీసుకోవడం నీతివిరుద్ధం.)

4. ఈపని బాధారహితమైన ది. పశ్చాత్తాపపడవద్దు. నీవు వదిలించుకుంటున్నది నీ ఒక కణితేకాని నీ కండరం కాదు. భావితరాలు (ఈకథ భావితరాలకు అందితే) నిన్ను అవి నిర్దోషిగా ప్రకటిస్తాయి. నీసమకాలీనులకు ఈవిషయంలో తీర్పుచెప్పే అవకాశం ఎటూ ఉండదు కదా.

5. వరుసగా సంభవించిన సిసిఫియన్ పరిస్థితుల వల్ల నీ ఆరోగ్యం ఇదివరకే దెబ్బతిని ఉంటే, ఇక ముందు సామాజిక ప్రాముఖ్యంకల విషయాల జోలికి పోవద్దు. సంఘర్షణ అనివార్యమైనప్పుడు, ఏది ఏమైనా, నీ పనిని బ్లూప్రింట్ దశనుదాట నివ్వవద్దు. ఫలితమేమైనా, నీ శ్రమను ఒక ఆహ్లాదకరమైన క్రీడగా పరిగణించు.

6. పైన చెప్పిన, 2 నుంచీ 5 వరకూ గల సూచనలను పాటించలేకపోతే ఆశాభంగం చెందవదు. 1వ సూత్రాన్ని అమలు జరుపు.

7. సిసిఫియన్ పరిస్థితి పరిష్కారాన్ని ఒక వీరోచిత కృత్యంగానో, లేదా లొంగిపోడంగానో భావించవద్దు. సిసిఫియన్ పరిస్థితి అసంగతమైనది కాబట్టి దానికటువంటి నైతిక సూత్రాలు వర్తించవు. అనంతమైన ఏకార్యమైన సరే, ఫలదాయకంగానూ, పూర్తి నిరుపయోగమైనదిగానూ ఉండవచ్చు.


వచ్చే సంచికలో

సోవియట్ యూనియన్ విదేశీ ఆర్థిక కార్యకలాపాలు

రెండవ ప్రపంచయుద్ధంలోని ప్రధాన రంగాలలో గెలుపు సాధించినదెవరు?

సోవియట్‌యూనియన్ తన సైన్యాన్ని ఎందుకు తగ్గిస్తోంది?

చంద్రుని పటంలోని రహస్యాలు



చిత్రరచన: యూరీ అఫోనిన్

BCP

## ప్రకృతి, కళలు



గ్జెహెల్ పింగాణీ పాత్రలు. గ్జెహెల్ మాస్కో సమీపంలోని చిన్న పట్టణం. యిక్కడ 18 వ శతాబ్దం నుండీ హస్తకళలు వర్ధిల్లుతున్నాయి. స్థానిక చేతివృత్తి పనివారు అనేక రంగులలో ఆకర్షణీయమైన పాత్రలను తయారు చేస్తున్నారు. అలంకరణగా వుపయోగించే గ్జెహెల్ టీ పాత్రను ఫొటోలో చూడవచ్చు.

Regd. No. M_8268



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M281 |
| పుస్తకం పేరు | సోవియట్ సమీక్ష |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | sowmya |
| పేజీలు విడదీసినది | sowmya |
| స్కాన్ చేసినది | Kaveri |
| పరీక్ష చేసినది | PRIYANKA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |